

*Chandamama Sankranti Number* *Photo by—N. Ramakrishna*

ఎరుకసాని!

స్వతంత్రా ఫిలిమ్సు

# ద్రోహి

డైరెక్షన్: ప్రసాద్  ప్రొడ్యూసర్: ప్రకాశరావు

తారాగణం: వరలక్ష్మి; ప్రసాద్; ప్రకాశరావు; రాళ్లబండి.

వివరములకు: **SWATANTRA FILMS LTD.,** MADRAS 17.



త్వరలో రానున్నది!

ప్రతిభా వారి

# బాలరాజు

అంజలీదేవి..... వరలక్ష్మి...నాగేశ్వరరావు...శివరావు...గాడేపల్లి...

ప్రొడ్యూసర్ & డైరెక్టర్... జి. బలరామయ్య

Studio... **NEWTONE**

**Photography..SRIDHAR... Script & Songs..SAMUDRALA... Music... PENCHALAYYA....**

తయారులోనున్న చిత్రములు

**స్వప్నసుందరి & అదృష్టదీపుడు**

*Distributors :*

| ANDHRA & CEDED : | MYSORE : | NIZAM : |
|---|---|---|
| **POORNA PICTURES** ★ | **THELLAM PICTURES CIRCUIT** ★ | **DECCAN FILM DISTS.** |
| BEZWADA. | BANGALORE CITY. | HYDERABAD. |

# స్త్రీకి సంతానం సహజమైన కోరిక








దానిని సఫలత నొందిస్తుంది★

లోధ్ర అంతటా దొరుకును



కేసరికుటీరం లిమిటెడ్.
మదరాస్



ఒరిస్సా, నైజాము, ఆంధ్ర, తమిళజిల్లాలకు ఏజెంట్లు:
శ్రీ సీతారామ జనరల్‌స్టోర్సు, బరంపురం, సికింద్రాబాదు, బెజవాడ, మధుర.

---







## "శ్రీవిస్ ఆమ్ల"

తలనూనె.



కురులను పెంచును.
దీనియందు
సువాసన, సుగుణము
రెండును కలవు.

  

యస్. విశ్వనాధం అండు కంపెని.
44, బందరు వీధి, మద్రాసు.



WE WANT STAR OF INDIA! PENCILS



For Work On The 1st

AVAILABLE FROM ALL DEALERS

**MADRAS PENCIL FACTORY—MADRAS**

మదరాస్ పెన్సిల్ ఫ్యాక్టరీ :: మదరాస్




| విషయము | | | పేజీ |
|---|---|---|---|
| సంక్రాంతి | ... | ... | 10 |
| మాచిట్టి | ... | ... | 13 |
| కలవారి కోడలు | ... | ... | 12 |
| గేయకథలు | ... | ... | 14 |
| పేదరాసి పెద్దమ్మ | ... | ... | 18 |
| ముగ్గురు కోడళ్ళు | ... | ... | 20 |
| రెండు విందులు | ... | ... | 21 |
| కథాసరిత్సాగరము | ... | ... | 24 |
| నాగకన్య | ... | ... | 26 |
| చదువుకున్న కాకిపిల్ల | ... | ... | 29 |
| తోకలేని తిమ్మరాజు | ... | ... | 33 |
| నలదమయంతి | ... | ... | 41 |
| పట్నం పందికొక్కు | ... | ... | 44 |
| కాంచనగంగ | ... | ... | 48 |
| అత్తాకోడళ్ళ కథలు | ... | ... | 57 |

| విషయము | | | పేజీ |
|---|---|---|---|
| మాయదారి పిల్లి | ... | ... | 61 |
| పంది తమ్ముడు | ... | ... | 65 |
| రాజుగారి ముస్తాబు | ... | ... | 69 |
| సంక్రాంతి ముగ్గులు | ... | ... | 77 |
| కొత్తా - పాతా | ... | ... | 81 |
| కొంగా - కోతి | ... | ... | 84 |
| చీమకాశీ ప్రయాణం | ... | ... | 86 |
| చాకలి వీరుడు | ... | ... | 89 |
| మినప రొట్టెలు | ... | ... | 93 |
| చావటంలో అనేకరకాలు | ... | ... | 96 |
| గతిలేనిభర్తకు మతిలేనిభార్య | ... | ... | 97 |
| లొట్టాయ్ కథ | ... | ... | 100 |
| లక్ష్మి - సరస్వతీ | ... | ... | 102 |
| మంచివంకాయ - పాడువంకాయ | ... | ... | 108 |
| గారడీ అద్దం | ... | ... | 109 |
| గజకర్ణ - గోకర్ణ | ... | ... | 113 |
| బ్రహ్మదేవుడిపాట్లు | ... | ... | 118 |
| జోల పాటలు | ... | ... | 123 |
| తండ్రి కొడుకులు | ... | ... | 124 |
| కిత కితలు | ... | ... | 130 |
| నేటిపాపలు - రేపటిపౌరులు | ... | ... | 135 |
| చందమామ పజిల్ | ... | ... | 136 |


త్రివర్ణ చిత్రాలు:


సింహళరాజు - నాగకన్య; శివుడు; దమయంతి - హంస ; సరస్వతి



సర్దార్ వల్లభభాయి పటేల్

[మన భారతదేశపు ఉపప్రధాని]



సింహళరాజు - నాగకన్య

[ ఈకథ 26వ పేజీలో చదవండి ]




సంధాలకుడు : చక్రపాణి

| | | |
|---|---|---|
| సంపుటి **2** | జనవరి, **1948** | సంచిక **1** |

## పాపలూ!

సంక్రాంతి చందమామ ఇదుగో మీ చేతులో ఉంది. దీంటో ఏ కథలు మీకు నచ్చినవో, ఏ పాటలు మీకు నచ్చినవో, ఏ బొమ్మలు మీకు నచ్చినవో వ్రాయండి. ఎందుకు నచ్చినవో కూడా వ్రాయండి. మీరురాసిన ఉత్తరాలలో బాగా ఉన్నవాటిని కొన్నిటిని చందమామలో అచ్చువేస్తాను. జ్ఞాపకం ఉంచుకుని రాస్తారుకదూ!

— సంచాలకుడు.




౧

* గెలముంద నెలముంద కులుకుతూ వచ్చావు
పలుక రింతా మంటె సంక్రాంతీ! నిలిచి మాటాడవే, సంక్రాంతి.

౨

పూరింటి పై నవ్వు
బీర పూవులమీద
చలి ముసుగు కప్పావు సంక్రాంతీ!
చకిలిగిం తెట్టావు, సంక్రాంతి.

౩

పాల చిక్కుడు చిగురు
కేలల్ల లాడింప
నీలాలు చిలికావు సంక్రాంతీ!
నిగ్గు లొలికించావు, సంక్రాంతి.

౪

వరిచేను తలనరసి
వంగి జోహా రంటె
కొడవళ్ళు పట్టించి సంక్రాంతీ!
కూల ద్రోయించావు, సంక్రాంతి.

౫

కోడి పుంజుల జోళ్ళు
కోలాట మేస్తుంటె
కత్తులే నూరావు సంక్రాంతీ!
కుత్తుకలె దరిగావు, సంక్రాంతి.

౬

ముగ్గులో గొబ్బెమ్మ
ముద్దుగా గూర్చుంటె
మూనాళ్ళ ముచ్చటని సంక్రాంతీ!
మోమింత చేశావు, సంక్రాంతి.

౭

గంగెద్దు సింగన్న
సంగీతమున కుబ్బి
తబ్బిబ్బు లయ్యావు సంక్రాంతీ!
తందనా లాడావు, సంక్రాంతి.

రచన :: ఏటుకూరి

* సంక్రాంతినెల వచ్చేలోగా కొన్నిచోట్ల చిక్కుడు గెలవేస్తుంది. కొన్నిచోట్ల నెలబట్టిన తరువాత గెల వేస్తుంది. దీన్ని పురస్కరించుకొని వచ్చిన యీ నానుడిని క్రొత్తింటి కోడలిమీద ప్రయోగిస్తారు. కడుపుముందా కాపురముముందా అని దీని యంతరార్థమట. ఇది ఆడుబిడ్డల పరిహాసోక్తులలో చేరుతుందనుకొంటాను.



౮

కోణంగి హరిదాసు
గొంతులో కొలువుండి
ఊళ్లూళ్ళు మేల్కొలిపి సంక్రాంతీ!
ఉఖ్ఖాత లూచావు, సంక్రాంతి.

౯

డబు డక్కవాడు నీ
తంకా బజాయింప
గంగెద్దు పై నెక్కి సంక్రాంతీ!
కదలివచ్చా వమ్మ, సంక్రాంతి.

౧౦

ముసలెద్దు రంకేసి
మూపురము గదలించె
నీచలువ నీవిలువ సంక్రాంతీ!
వాచా మగోచరము, సంక్రాంతి.

౧౧

నీరుల్లి మడిలోన
వేరూని చిరికూర
సనలు దొడిగిందమ్మ సంక్రాంతీ!
నిను నుతించిం దమ్మ, సంక్రాంతి.

౧౨

సెనగ పూవుల రైక
చినదాని యొడి నేల
గాలి తరగల లోన సంక్రాంతీ!
గోలి దిరిగాడింది, సంక్రాంతి.

౧౩

మిరెపపారా జెట్టి
మెరయు పంట వలంతి
పరిగె పాటలు పాడె సంక్రాంతీ!
బంతిపూ పస పాడె, సంక్రాంతి.

౧౪

అరిసెల పూపాలు
చిరుతిండి బండార
మల్లి గుజ్జలకు నై సంక్రాంతీ!
ఆటక చేర్పించావె, సంక్రాంతి.

౧౫

ఆబాల గోపాల
మానంద వార్ధిలో
మునిగి తేలినదమ్మ సంక్రాంతీ!
తనువె మరచిందమ్మ, సంక్రాంతి.

౧౬

కవులకును శిల్పులకు
కావలసి నంతపని
కల్పింతు వేడేట సంక్రాంతీ!
కనిపింతు వొకమాటె, సంక్రాంతి.

౧౭

స్వాతంత్ర్య భారత
చ్ఛాయలం దీనాడు
నీరూప మరసితిమి సంక్రాంతీ!
నిర్వృతిం బొందితిమి, సంక్రాంతి.



# మా చిట్టి

ప్రొద్దున్నె మా చిట్టి నిద్రలేచింది
నిద్రలేచీ చిట్టి మొగము కడిగింది
గోమయము తెచ్చింది గొబ్బిచేసింది
గొబ్బిచుట్టూ తిరిగి పాట పాడింది.

గొబ్బిదేవీ తల్లి ఓ గొబ్బిదేవీ
చేమంతి పూవంటి చెల్లి నివ్వావే
తామరాపూవంటి తమ్ము నివ్వావే
మల్లెపువ్వావంటి మరది నివ్వావే
బంతిపువ్వావంటి బావ నివ్వావే
మొగలిపువ్వావంటి మగని నివ్వావే.

తలుపుచాటున నక్కి బావ విన్నాడు
పకపకామని బావ పగలబడ్డాడు
ఇదియేమె మరదలా యిట్లు కోరేవు?
మొగలిపువ్వావంటి మగని కోరితివి
ముళ్లతో గీరేను నీ వళ్లు సుమ్మి!

ఆమాట వినగానె మాచిట్టి కపుడు
సిగ్గొచ్చి పరుగెత్తె తల్లిదగ్గరకు.

చుండూరి రమాదేవి, ఏలూరు.

# కలవారి కోడలు

సంపాదన : చెన్నాప్రగడ పద్మావతి, పెదరావూరు

కలవారి కోడలు కలికి కామాక్షి
కడుగుచున్నది పప్పు కడవలోపోసి.
అప్పుడే వితెంచె ఆమె పెద్దన్న
కాళ్ళకు నీళ్లిచ్చి కన్నీరువింపె.



"ఎందుకో కన్నీరు ఏమికష్టమ్మ ?
తుడుచుకో చెల్లెలా, ముడుచుకో కురులు,
ఎత్తుకో బిడ్డను, ఎక్కు అందలము,
మీ అత్త మామలకు చెప్పిరావమ్మ."

"కుర్చీపీటమీద కూర్చున్న అత్త,
మా అన్నలొచ్చారు మముబంపుతార ?"
"నేనెరుగ నేనెరుగ, మీమామ నడుగు!"

"పట్టెమంచముమీద పడుకున్నమామ,
మా అన్నలొచ్చారు మముబంపుతార?"
"నేనెరుగ నేనెరుగ, మీబావనడుగు!"

"భారతము చదివేటి బావ, పెదబావ,
మా అన్నలొచ్చారు మముబంపుతార ?"
"నేనెరుగ నేనెరుగ, మీ అక్కనడుగు"

"వంటచేసేతల్లి, ఓ అక్కగారూ,
మా అన్నలొచ్చారు మముబంపుతార ?"
"నేనెరుగ నేనెరుగ, నీభర్తనడుగు"



"రచ్చలోవెలిగేటి రాజేంద్రభోగి,
మా అన్నలొచ్చారు మముబంపుతార ?"
"పెట్టుకో సొమ్ములూ, కట్టుకో చీర,
పోయిరా సుఖముగా పుట్టినింటికిని."

# గేయకథలు

ఏటుకూరి

## కంచిమేక







చిలుకా చెల్లె లెందూకోస-మలిగిం దబ్బాయీ?
చిట్టీ పొట్టీ నీతికథలూ-చెప్తా వింటుందా?

కంచీ మేకా జబ్బూ చేసి
కలవా రిస్తూంటే,
తోడీ మేకాలన్నీ దాన్ని
చూడా వచ్చేవి. ★

చూచీ పోతా వేడీ వెచ్చా
చూచీ నట్లుండీ,
ప్రోగూ చేసీ కొన్నా గడ్డీ
పోచా లన్నింటీ,
వీసా మంతా మిగులా కుండా
మేసీ పోయినవీ! ★

కదలా లేకా కంచీ మేకా
కన్నీ రెట్టిందీ,
నీళ్ళూ మేతా లేకా తుదకూ
నీలిగి చచ్చిందీ. ★

ఇట్టీ చుట్టాలుంటే లాభ-మేమీ చెప్పండీ
చేరా నిస్తే యిల్లూ గుల్లా-చేసి పోతారూ—



# పండు కోతి



కొండ మీద కోతిమూక-కూరు చున్నదీ
కూరు చుండి కిచకిచాని-కేరు చున్నదీ.

గండెవంటి కోతి పిల్లా
గంతు లేయూచూ
★ పండు కోతి వీపు మీది
పుండు చూచిందీ.



చూచీ వచ్చి పుండు గిల్లి
పీచూ రేపిందీ.
తక్కూ కోతూ లన్నీ వచ్చి
★ దాని మోస్త్రారే
తుక్కుబడ గిల్లి దాని
దుంపా దెంపేవి.



పండు కోతి పుండు వాచి
బాధ హెచ్చింది
★ కంట నీరు పెట్టి వాయి
గ్రమ్మి చచ్చిందీ.

కోతి పనులు చేస్తే కొంప-గూలీ పోతుందీ
మోటు మూక తోడీ పొత్తు-ముప్పా దెస్తుందీ.

# ఎవడు త్రవ్వుకున్న గోతిలో వాడే పడతాడు !



చవకగా వచ్చినై గదా అని నవాబుగారు అణా యిచ్చి
అరడజను అరటిపళ్ల కొనుక్కొని తింటూ బయలుదేరారు.



ఆ పళ్లు తింటూ తొక్కల్ని దర్జాగా రోడ్డుమీద పారేశారు. ఇంకేముందీ,
ఆ తొక్కలమీద కాలుపడి నవాబుగారే తమ్మనిజారి నడ్డివిరిగేట్టుగా పడ్డారు.

# డాక్టరూ — రోగి

శారద ఒక కుక్కపిల్లని పెంచుతోందిట. ఆ కుక్కపిల్లకిఓ రోజున కడుపునొప్పి వచ్చిందిట. అప్పుడు, శారద వైద్యుడుదగ్గరికి పోయి మందు తెచ్చింది.





"ఈ మాత్రవేసుకో, కడుపునొప్పి పోతుంది!" అని మాత్రలడబ్బీ తెచ్చింది. కాని కుక్కపిల్ల మాత్ర ఎలా వేసుకుంటుందీ?



అందుకని, "ఉండు, ఈ గొట్టంలో మాత్ర వేసి ఊదుతాను," అని శారద ఒకగొట్టం తెచ్చి కుక్కపిల్లనోట్లో పెట్టింది.





గొట్టంలో మాత్రవేసి, శారద "పూ!" అని ఊదబోయింది.





కాని, కుక్కపిల్లే శారదకంటే ముందుగా పూదింది. ఇంకేముంద్లీ! మాత్ర కాస్తా శారద గొంతులోకే పోయింది!




**అబ్బాయిలూ, అమ్మాయిలూ!**

మీరు పేదరాసి పెద్దమ్మను గురించి ఎన్నో కథలు విని ఉంటారు. రాజుకొడుకులూ, రాజుకూతుళ్ళూ ఉండే కథల్లో సామాన్యంగా పేదరాసిపెద్దమ్మ తప్పకుండా ఉంటుంది. ఈ మనిషి ఎటువంటిదో మీరెప్పుడైనా ఆలోచించారా? ఆలోచించండి. ఆలోచించినకొద్దీ ఈవిడ వింత ప్రకృతి మీకే చక్కగా బోధపడుతుంది.

పేదరాసిపెద్దమ్మ కథలో అడుగుపెట్టిన క్షణంనుంచీ కథ రక్తికి వస్తుంది. రాజుకొడుకు గాని, కట్టెలుకొట్టేవాడి కొడుకు కాని, కథానాయకుడెవరైనాగానీ పేదరాసిపెద్దమ్మ ఇంటో అడుగుపెట్టాడా, వాడి కష్టాలన్నీ గట్టెక్కాయన్న మాటే! కథానాయకుడు ఎటువంటి చిక్కుల్లోనైనా ఉండనివ్వండి, వాడికి రాజుగారు ఎటువంటి పరీక్షలైనా పెట్టనివ్వండి, పేదరాసి పెద్దమ్మ వాడికి అండగా ఉండి, వాడికి అపాయం రాకుండా సంరక్షిస్తుంది.

పేదరాసిపెద్దమ్మకు తెలియనివిషయం లేదు. సప్త సముద్రాల అవతల ఒక భీకరారణ్యంలో ఏడు మర్రిచెట్లలో మధ్య దాని చిటారు కొమ్మన ఒక పంజరంలో చిలక కంఠంలో ఒకరాక్షసుడిప్రాణం ఉంటుంది. దానిచుట్టూ బ్రహ్మరాక్షసులూ ఇనప కందిరీగలూ, కొండెతాచులూ కాపుంటాయి. ఆ చిలకను మన కథానాయకుడు పట్టుకు రావాలంటే ఎట్లావెళ్లాలో, ఏంచేయాలో పేదరాసిపెద్దమ్మను అడిగితే చెబుతుంది.

పేదరాసిపెద్దమ్మ ఎక్కడికైనా పోగలదు. రాజుగారి అంతఃపురంలో, ఏడంతస్తుల మేడలో, పై అంతస్తున, విచ్చుకత్తుల వాళ్ల పహరాలో రక్షించబడే రాజుకూతురును కథానాయకుడు చూడాలి, ఎట్లా? పేదరాసిపెద్దమ్మ కథానాయకుణ్ణి తనవెంట తీసుకుపోతుంది. "వీడు మా చెల్లెలికొడుకు," అని పేదరాసిపెద్దమ్మ చెబితే చాలు, కోటలో అడ్డేవారుండరు.

పేదరాసిపెద్దమ్మ ప్రయాణీకులకూ, దూరదేశంవారికీ తిండిపెట్టి జీవించే సామాన్యురాలు. కాని ఆమెకు యెవరి ఎక్కువాలేదు. ఆమె నేరుగా రాజుగారితో మాట్లాడుతుంది, రాణిగారితో మాట్లాడుతుంది. ఆమెనెవరూ అనుమానించరు, అవమానించరు. ఆమెసర్వస్వతంత్రురాలు. అందుకే మనకు పేదరాసిపెద్దమ్మను చూస్తేసంతోషం.



పేదరాసిపెద్దమ్మ ప్రతివిషయంలోనూ జోక్యంకలిగించుకుంటుంది. ఎవరికీ అపకారం చెయ్యదు. అందరి మంచీ ఆమెకే అందరికన్నా బాగాతెలుసు. కథానాయకుణ్ణి చంపించటం తనకు క్షేమమనీ, తన కూతుర్ని వాడు చేసుకోవటం అపకారమనీ రాజుగారుపొరపడవచ్చు. కాని నిజం పేదరాసి పెద్దమ్మకుతెలుసు.ఆవిడ తాత్కాలికంగా రాజుగారిని మోసంచేసినా ఆ మోసంవల్ల రాజుగారికెంతో ఉపకారమే జరుగుతుంది.

ఎంతోమందికి ఎన్నోరకాల ఉపకారం చేస్తుంది. కాని పేదరాసిపెద్దమ్మ స్వార్థం కోరదు. ఆమెకు డబ్బు అవసరంలేదు. అందరూ కులాసాగా ఉండటమే ఆమెకు కావలసింది.ఆమెకు ప్రతిబంధకాలులేవు. భర్తలేడు, పిల్లలు లేరు, పెద్ద డబ్బులేదు, భవంతులులేవు.ఆమెఏమో, ఆమె హోటలేమో!అది నాలుగుకాలాలపాటు సాగుతూ వుంటే, తనదగ్గిరికి వచ్చినవారికి ఇంత ఉపకారం చెయ్యటంకంటె పేదరాసి పెద్దమ్మకు కావలిసింది లేదు.





తనమూలంగా ఇంకొకడికి రాజ్యం వచ్చినా, చక్కని చుక్క అయిన రాజు కూతురు భార్యగా దొరికినా పేదరాసి పెద్దమ్మ తనకు దొరికినంతగా సంతోషిస్తుంది. తనకేమీ పేచీలు లేకపోయినా ఇతరులపేచీలు సరిదిద్దుతుంది. తాను సామాన్యప్రజలో జత అయిన మనిషే అయినా అన్నితరగతులవాళ్లకూ ఆశ్రయమిస్తుంది. తనధర్మాన గొప్పవాళ్లయినాక వారి దారిన వారిని పోనిస్తుందేగాని వారి వెంటపడి తానొక ఘరానా మనిషి కావటానికి ప్రయత్నించదు.

డబ్బువిషయాలలో కూడా ఆమె ఎప్పుడూ పేచీలుపెట్టదు. ఏవేళకు వచ్చినా అన్నార్తులకింత తిండిపడేస్తుంది. కొందరు మాసాల తరబడి తనఇంటనే ఉంటారు. కొందరు వరహాలిస్తారు. కొందరు ఏమీ ఇవ్వరు. అందర్నీ పేదరాసి పెద్దమ్మ సమంగానే చూస్తుంది. ఎవరు తనఇంటికి అతిథిగా వచ్చినా వారిపని పూర్తిఅయే వరకు వాళ్లను పొమ్మనదు. ఆమెదగ్గిరికిచేరి అసంతృప్తిపొందే మనిషి అంటూ ఉండడు.

అటువంటి అద్భుతమైనవ్యక్తి పేదరాసి పెద్దమ్మ.

# ముగ్గురు కోడళ్లు

అనగనగా ఒక ఊరు. ఆ ఊళ్లో ఒక అత్త ఆ అత్తకు ముగ్గురు కోడళ్లు. ఆ ముగ్గురు కోడళ్ళకు ఒక నిమిషంకూడా పడేదికాదు. ఎప్పుడూ ఎదో ఒక తగువులాట వుండేది. ముఖ్యంగా ఇంటికి చుట్టాలు వచ్చినప్పుడు నేను వడ్డించాలంటే నేను వడ్డించాలని వత్సందాలు పోయేవాళ్లు. "ఓసి మీ దుంపలుతెగ, గుట్టుగాజరిగిపోయే సంసారాన్ని బజార్లో పెడతారటే" అని అత్త మంవలించేది. అయినా కోడళ్ల తగవులు తెగేవికావు. చివరికి విసిగెత్తి యింట్లోచేయవలసిన పనిపాటలు అత్త ముగ్గురికీ పంచింది.

భోజనాలప్పుడు పెద్దకోడలు విస్తళ్లు వేసి, మంచినీళ్లుపెట్టాలి. రెండో కోడలు అన్నీ వడ్డించాలి. మూడోకోడలు విస్తళ్ళు తీసి దిబ్బమీద పారెయ్యాలి.

ఈ ఏర్పాట్లతో పనిపాటలు సక్రమంగా సాగిపోతున్నాయి. కోడళ్లు పోట్లాట మానివేశారు. అత్త చాలా సంతోషించింది. ఇక సంసారానికి ఎలాంటి రద్దీ లేదనుకొంది.

ఇలావుండగా ఒకరోజున ఆ ఇంటికి చుట్టాలువచ్చారు. అత్త కోడళ్ళను పిలిచి "ఎవరిపనులు వారు త్వరత్వరగా శుభ్రంగా చేసుకొనిపొండి" అని చెప్పింది. ముగ్గురు కోడళ్లూ సరేనంటే సరేనన్నారు.

చుట్టాలు కాళ్లుకడుక్కొనివచ్చి పీటల మీద కూర్చున్నారు. పెద్దకోడలు త్వరత్వరగా విస్తళ్లువేసి నీళ్ళుపెట్టింది. బంధువులు సంతోషించారు. రెండో కోడలువచ్చి గబగబా చేసిన నాలుగు పిండివంటలూ వడ్డించిపోయింది. అంత తొందరగా వడ్డించినందుకు కూర్చున్నవాళ్ళంతా విస్తుపోయారు. ఇంతలో మూడోకోడలువచ్చి వడ్డించిన విస్తళ్లన్నీ గబగబా ఎత్తివేసి దిబ్బమీద పారేసింది. కూర్చున్నవాళ్ళు ఒకరిముఖం ఒకరు చూచుకొన్నారు.

అత్త ముఖమింత చేసుకొని, "ఇదిఏమిటర్రా?" అంది.

"ఏమున్నది! నీవు చెప్పినట్లే ఎవరిపని వాళ్లు త్వరగా చేసుకొన్నాము అత్తయ్యా!" అన్నారు ముగ్గురు కోడళ్ళూ ఒక్కసారిగా.

కాళహస్తి బాల, విశాఖపట్నం.




ఒక వూళ్లో ఇద్దరు అన్నదమ్ములు. అన్న చాలా భాగ్యవంతుడు. తమ్ముడు, పాపం అమిత బీదవాడు.

తమ్ముడు ఒకనాడు సంపాదన కోసరం దేశాంతరం బయలుదేరుతూ, దారిలో తినటానికి భార్యను ఏమైనా చేసిఇవ్వమని అడిగాడు. భార్య ఐదు మినపసున్ని ఉండలు చేసి గుడ్డలో మూటకట్టి ఇచ్చింది.

అతను ఆమూట కర్రకు తగిలించుకుని, కర్ర భుజాన పెట్టుకుని బయల్దేరాడు. పోగాపోగా చీకటిపడే సమయానికి ఒక పెద్ద చెరువూ దానిపక్కన వెదురుపొదా కనిపించాయి. ఆచెరువులో కాసిని నీళ్ళుతాగి, భుజంమీది మూట వెదురు పొదలో ఒక గడకు తగిలించి ఆరాత్రికి అక్కడే పడుకుని నిద్రపోయాడు.

కొంత పొద్దెక్కినాకగాని అతనికి మెలకువ రాలేదు. తీరా అతను లేచే సరికి రాత్రి మంచుకు తడిసి వంగి ఉండిన వెదురుగడ ఎండకు పైకి నిలబడి ఉంది. దానితోపాటు అతని మినపసున్ని ఉండల మూటకూడా పైకి వెళ్లింది. మళ్ళీ సాయంకాలమైతేగాని మూట కిందికి రాదని గ్రహించి అతను ఆకలితోటే మళ్ళీ నిద్రపోయాడు.

ఈసమయంలో ఆకాశంలో తిరుగుతున్న అయిదుగురు గంధర్వులకు మినపసున్ని ఉండల వాసన తగిలింది. వెదురు గడకు వేళ్లాడేమూట చూశారు. దాన్ని విప్పి అందులోఉన్న ఐదు సున్నిఉండలూ ఐదుగురూ తిన్నారు. చెరువు గట్టున నిద్రపొయ్యే మనిషిని చూచి అతని బీదస్థితికి జాలిపడి సున్ని ఉండలకు బదులు ఒక చిన్న పెట్టెను

అవసరాల రామకృష్ణరావు, తుని—డి. సి. శ్రీరాములు, నాయుడుపేట



ఆమూటలోఉంచి గంధర్వులు వెళ్ళిపోయారు.

అతను లేచేసరికి సాయంకాలమయింది. వెదురుగడకిందికి వంగిఉంది. ఆకలి దహించుకు పోతూండటంవల్ల అతను ఆత్రంగా మూట దించుకుని విప్పి చూసేసరికి పెట్టె కనిపించింది. అతను ఆశ్చర్యంతో దాని మూత తెరిచాడు. వెంటనే పెట్టెలోనుండి యిద్దరు గంధర్వ స్త్రీలు బయటికి వచ్చి పంచభక్ష్య పరమాన్నాలతో అతని ముందు భోజనం ఉంచి తిరిగి పెట్టెలోకివెళ్ళి మాయమయ్యారు.

అతను భోజనంచేసి, సంతోషంతో పెట్టె తీసుకొని యింటికివెళ్ళి భార్యకు సంగతంతా చెప్పాడు మర్నాడతను ఊళ్లో వాళ్ళందరినీ పిలిచి, పెట్టె సహాయంతో వచ్చిన వారందరికీ షడ్రసోపేతంగా విందుచేశాడు. వచ్చిన వారంతా పెట్టెనుగురించి వింతగా చెప్పుకుంటూ వెళ్ళిపోయారు.

తమ్ముడికి కలిగిన ఈ అదృష్టం గురించి భాగ్యవంతుడైన అన్నకు అసూయ కలిగింది. పెట్టె దొరికిన వృత్తాంతమంతా అన్న తమ్ముడివల్ల తెలుసుకొన్నాడు. భార్య ప్రోద్బలంవల్ల అటువంటి పెట్టె తానుకూడా సంపాదించుకు రావాలనుకున్నాడు. భార్యచేత మినపసున్ని ఉండలు చేయించుకుని తానుకూడా తమ్ముడు వెళ్ళిన దారినే బయులుదేరాడు.

వెళ్ళి వెళ్ళి ఇతనుకూడా చెరువు దగ్గిరికి చేరుకున్నాడు. వెదురు పొదకు మూట తగిలించి పడుకుని నిద్ర పోయినాడు.



ఎప్పటిలాగే ఐదుగురు గంధర్వులూ చాటుగా వెళ్తూ సున్ని ఉండల వాసన పసికట్టి మూట విప్పి చూశారు. 'ఒకసారి పెట్టెఇస్తే తృప్తిచెందక వీడు మళ్ళీ వచ్చాడు. చాలా ఆశాపాతకుడుగా ఉన్నాడే' అనుకున్నారు. మినపసున్ని ఉండలు తిని వాటికి బదులు మరొక పెట్టె పెట్టి వెళ్ళిపోయినారు.



మర్నాడు సాయంకాలం వెదురు కిందికి వంగగానే అన్న మూట విప్పి చూసుకున్నాడు. మూటలో పెట్టె ఉంది. తనపని నెరవేరిందిగదా అనే సంతోషంతో పెట్టెతోసహా ఇంటికివచ్చి భార్యకు చూపించాడు. వారి ఆనందానికి మేరలేదు.

మరునటి రోజున అన్నకూడా ఊళ్ళో వాళ్ళనందరినీ విందుకు పిలిచాడు. అందరూవచ్చి బంతులు తీరి కూర్చున్నారు. అన్న జాగ్రత్తగా పెట్టె మూత తెరిచాడు. తెరిచేసరికి అందులోనుంచి అతిథికి ఇద్దరేసి మంగళ్ళు పొదులతోసహా బయటికి వచ్చారు. ప్రతి అతిథినీ ఒక మంగలి గట్టిగా పట్టుకుంటే రెండో మంగలి తల నున్నగా గొరగసాగాడు. కొద్ది సేపట్లోనే అందరి తలలూ బోడిగుండ్లు అయాయి. తర్వాత మంగలి వాళ్ళంతా పెట్టెలోకి తిరిగివచ్చి మాయమయ్యారు.

ఆరోజు ఆ ఊళ్ళో అన్నను తిట్టని వాళ్ళులేరు. అతను ఆలస్యం చెయ్యకుండా తనకు దొరికిన పెట్టెను సముద్రంలో పారేయించి తన అత్యాశకు తగిన ప్రాయశ్చిత్తం జరిగిందని తెలుసుకున్నాడు.






ఒకనాడు కైలాసంలో పార్వతీదేవి శివుణ్ణి ఏమని కోరిందంటే, మూడు లోకాలలోనూ ఎవ్వరూ యెన్నడూ వినని కథలు తనకు వినిపించమన్నది. శివుడు సరేనని, వాకిట నందిని కాపుంచి, యెవ్వరినీ లోపలికి రానివ్వవద్దని ఆజ్ఞాపించి పార్వతికి అనేకవందల కథలు చెప్ప నారంభించాడు.

శివుడిదగ్గిర కొలువుండే భూతప్రేత గణాలకు నాయకులలో ఒకడైన పుష్పదంతుడు ఈవిషయం పసికట్టి శివుడు కథలుచెప్పేచోటికి వచ్చాడు. లోపలికి పోవటానికి శివాజ్ఞలేదని నంది అడ్డగించాడు. పుష్పదంతుడు నేరుగా లోపలికి వెళ లేక తుమ్మెదరూపం ధరించి నందికి తెలియకుండా లోపల ప్రవేశించి ఒక స్తంభం చాటునవుండి శివుడు పార్వతికి చెప్పిన కథలన్నీ విన్నాడు. అతరువాత ఇంటికివెళ్ళి పుష్పదంతుడు తానువిన్న కథ లన్నిటినీ తన భార్య అయిన విజయకు చెప్పాడు.

మర్నాడు ఆ కథలనే విజయ ఇతరులకు చెప్పుతూవుండటం విని పార్వతీదేవి పుష్పదంతుడి మోసం గ్రహించినదై, అతన్ని నరజన్మమెత్తమని శపించింది. పుష్పదంతుడి పక్షాన మాల్యవంతుడనేవాడు వాదించడానికి రాగా పార్వతి మాల్యవంతుణ్ణికూడా నరజన్మమెత్తమని శపించింది.

పుష్పదంత మాల్యవంతు లిద్దరూ పార్వతి పాదాలపైబడి తమకు శాపవిముక్తి అనుగ్రహించమన్నారు. చివరికి వారిమీద అనుగ్రహం కలిగినదై పార్వతి వారికి ఈవిధంగా చెప్పింది :





"వింధ్యపర్వతాలలో గణభూతి అనే యక్షుడు శాపగ్రస్తుడై పిచ్చివాడల్లే తిరుగుతున్నాడు. పుష్పదంతుడు నర జన్మమెత్తి ఆ గణభూతిని కలుసుకుని అతనికి ఈ కథలన్నీ చెప్పినట్టయితే పుష్పదంతుడికి శాపవిముక్తి అవుతుంది. గణభూతి తానువిన్న కథలన్నీ మాల్యవంతుడికి చెప్పినట్టయితే గణభూతికి శాపవిముక్తి కలుగుతుంది. మాల్యవంతుడు ఈ కథలనన్నిటినీ పుస్తకంగా రాస్తే అతని శాపం పోతుంది."

పార్వతి శాపం ప్రకారం పుష్పదంతుడు భూలోకంలో వరరుచిగా పుట్టాడు. మాల్యవంతుడు గుణాఢ్యుడుగ పుట్టాడు. వరరుచి వింధ్యపర్వతాలంతా వెతికి గణభూతిని పట్టుకుని తాను దొంగతనంగావిన్న కథలన్నీ అతనికి చెప్పేశాడు. శాపవిముక్తుడై కైలాసానికి తిరిగి వెళ్ళాడు. గణభూతి ఈ కథలనే గుణాఢ్యుడికి చెప్పి తానుకూడా శాపవిముక్తుడైనాడు. ఆతరువాత గుణాఢ్యుడు ఈ కథలనన్నిటినీ తాటాకుల మీద రాసి ఆ పుస్తకానికి "కథాసరిత్సాగరం" అని పేరుపెట్టాడు. అతను కూడా శాపవిముక్తుడైనాడు.

ఈ కథలు మీకుకూడా వినాలని వుందా? ఐతే వచ్చేనెలనించి ఒక్కొక్క కథచెబుతాను వినండి.






పూర్వం సింహళదేశానికి రాజొకడుండేవాడు. ఆయన పరాక్రమానికి అర్జునుడు, బుద్ధికి బృహస్పతి, దానానికి కర్ణుడు, ఐశ్వర్యానికి కుబేరుడు. ఇన్నీ ఉన్నా ఆయనకు సంతానం లేదు. ఎందుచేతనంటే ఆయనకు వివాహం కాలేదు. ఎన్ని దేశాల రాజపుత్రికల్ని చూసినా ఆయనకు నచ్చలేదు.

ఇట్లా ఉండగా ఒకనాడు సింహళదేశానికి పర్షియాదేశపు వర్తకులు ఓడలపై వచ్చారు. వారిలో పెద్దవర్తకుడు రాజుగారిని ఒంటరిగాచూసి ఏమన్నాడంటే. "మహారాజా! నావెంట ఒక బానిసపిల్లను తెచ్చాను. ఆమెను మించిన సౌందర్యవతి ప్రపంచంలో ఎక్కడాలేదు. మీకు ఆమె నచ్చినట్టయితే కోటి మొహరీలకు ఇచ్చేస్తాను," అని.

రాజు ఆమెను చూడటానికి ఒప్పుకున్నాడు. వర్తకుడు బానిసపిల్లను మేనాలో అంతఃపురానికి తెప్పించాడు ఆమెమేనాలోనుంచి దిగుతూండగా చూసి రాజు ఆమెనే తప్ప మరొకరిని పెళ్ళాడనని నిశ్చయించుకున్నాడు. కోటి మొహరీలు పుచ్చుకుని బానిసపిల్లను రాజాంతఃపురంలో వదలి వర్తకుడు తన స్నేహితులతో సహా తన దేశానికి తిరిగి వెళ్ళిపోయినాడు.

రాజుగారు తనపెళ్ళికి శుభముహూర్తం పెట్టించి ఈలోపుగా రాణీగారి కోసం సముద్రతీరాన ఒక దివ్యభవనం కట్టించాడు. అది తన భార్యకు భరణంగా ఇచ్చేశాడు. రాజుగారికిన్నీ బానిసపిల్లకున్నూ అతివైభవంగా వివాహం జరిగింది. కొత్తరాణీగారు తన భవనం ప్రవేశించింది.

ఇప్పుడు రాజుగారి కొక దిగులుపట్టుకున్నది. రాణీగారు తనతో నోరుతెరచి ఒక్కముక్క మాట్లాడదు. ఎప్పుడూ తన భవనంలో కూర్చుని సముద్రంవేపుచూస్తూ ఉంటుంది. భర్త వస్తే లేచి నిలబడదు. భర్తను గౌరవించదు.

ఒక్క సంవత్సరం గడిచిపోయింది. తనభార్య విచిత్రపు వర్తనకు కారణం ఏమిటో తెలుసుకోవాలని రాజుగారు చాలా ప్రయత్నించాడు కాని లాభం లేకపోయింది. ఆమె నోరువిప్పదు.

ఇంతలో రాణీగారు గర్భవతి అయి ఒక మగపిల్లవాణ్ణి కన్నది. ఈవార్త రాజుగారికేగాక దేశంలో ప్రజలందరికీ ఎంతో సంతోషం కలిగించింది. ఎందుకంటే

 

రాజుగారివంశానికి ఒక అంకురం కలిగింది. దేశమంతటా ఉత్సవాలు చేసుకున్నారు.

ఇకనైనా రాణీ తనహృదయంలో ఉన్న రహస్యం బయటపెడుతుందేమోనని రాజుగారు ఆమె భవనానికి వెళ్లాడు. "నీకేమిటి విచారం? ఎంత బతిమాలినా నాతోఎందుకు మాట్లాడవు? నీవాళ్లకోసరం తపించిపోతున్నావా? నీకేదైనా తీరనికోరిక ఉందా? ఏమిచేస్తే నువ్వు సంతోషిస్తావు? చెప్పు." అని భార్యను బతిమాలాడు.

ఇంత కాలానికి నోరుతెరిచి రాణీ తనవృత్తాంతం ఈవిధంగా చెప్పింది.

"రాజా, నన్ను నువు డబ్బిచ్చి కొనుక్కున్నావు. నాయిష్టం అడగకుండా పెళ్లిచేసుకున్నావు. నేను నీబానిసను. నువ్వు చెప్పినట్టుచెయ్యటమే నావంతు. ఇంతకాలమూ నేను నీభార్యను కాను. యిప్పుడు మనయిద్దరికీ ఈకొడుకు కలిగాడు కనక నిన్ను నాభర్తగా అంగీకరిస్తున్నాను. నన్ను నువ్వు డబ్బిచ్చి కొన్నప్పటికీ నేను బానిసజాతి మనిషిని కాను. నేనొక నాగకన్యను. నా అన్న నాగలోకపురాజు. ఐతే శత్రువులు మాఅన్నమీద దండెత్తి రావటంచేత నేను నావారిని విడిచిపెట్టి ఎక్కడో తల దాచుకోవలసి వచ్చింది. నాగలోకం వొదిలేసి







భూలోకంలో ఏరాజునైనా పెళ్లాడమని నాకు మావాళ్ళు సలహాయిచ్చారు. కాని నేను మానవ మాత్రులను పెళ్లాడటానికి ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు.

"ఇట్లా ఉండగా ఒకనాడు నేను సముద్రంలో ఈదులాడుతూండగా కొందరు పర్షియాదేశపు వర్తకులు పడవలలోపోతూ నన్ను చూసి వలవేసి పట్టుకున్నారు. వారే నన్నుతెచ్చి నీకు విక్రయించారు. నాపేరు నీలోత్పల."

నీలోత్పల చెప్పిన కథవిని రాజు ఆశ్చర్యపోయి, "నువు నాగకన్యకవా? రాజకుమార్తెవా? నేను నమ్మలేకుండా ఉన్నాను. ఎందుకంటే, నువు నాగకన్యకవైతే భూమిమీద ఎట్లా నివసించ గలిగావు?" అని అడిగాడు.

"రాజా, మేము మీలాటి మానవులము కాము. నీటిలోనూ నేలమీదాకూడా నివసించగల దేవతలము. నీ కింకొక చిత్రం చూపుతానుచూడు," అంటూ నీలోత్పల పరిచారికలను పిలిచి నిప్పూ, సాంబ్రాణీ తెప్పించింది. నిప్పులో సాంబ్రాణి ధూపం వేసి ఏవో మంత్రాలు చదివింది. సాంబ్రాణి ధూపం నాలుగుమూలలా దట్టంగా అల్లుకున్నది. ఆ పొగలోనుంచి కొందరు మనుషులు ప్రత్యక్షమైనారు. ఆ వచ్చినవారు నీలోత్పల అన్న అయిన నాగరాజూ, అతని పరివారమూనూ. వారంతా సముద్రంలో నుంచే వచ్చారు.

నీలోత్పల తన అన్నగారితో తన కథంతా చెప్పి తన కుమారుణ్ణి అతనిచేతి కిచ్చింది. నాగరాజు తన మేనల్లుణ్ణి చేతుల్లో తీసుకుని అకస్మాత్తుగా సముద్రంలోకి దూకి అంతర్ధానమై పోయినాడు. నీలోత్పల అన్నగారు తన కుమారుణ్ణి తీసుకుని పారిపోయినాడని రాజుకు భయం కలిగింది. కాని కొద్దిసేపట్లోనే అతను పిల్లవాడితో తిరిగివచ్చి, "మామాదిరిగా మా మేనల్లుడుకూడా నీటిలో నివసించ గలడో లేడో చూడటానికి తీసుకుపోయినాను. ఈ కుర్రవాడిలో మా రక్తం ఉండటంచేత మాలాగే నీటికింద నివసించ గలడు," అని చెప్పాడు

కొంతకాలంపాటు నాగరాజు తన బావగారైన సింహళ రాజు ఆతిథ్యం స్వీకరించి తరువాత తన చెల్లెలినీ, మేనల్లుణ్ణీ వెంట పెట్టుకుని నాగలోకానికి వెళ్లాడు. అక్కడ కొంతకాలం వారిని ఉంచుకుని తరువాత తిరిగి పంపాడు. నాగలోకంగురించి కుమారుడు చెప్పిన వింతలు వినటమేగాని అవి చూసేభాగ్యం సింహళరాజుకు లేకపోయింది. మేనమామల యింటినుండి రాజు కొడుకు చిత్ర విచిత్రమైన వస్తువులనూ, జంతువులనూ తెచ్చి తండ్రి కిచ్చేవాడు.

ఈవిధంగా సింహళదేశపు రాజు, నీలోత్పలతోటీ, తన కుమారుడితోటీ ఎంతో కాలం సుఖంగా గడిపాడు




అనగా అనగా ఒకకాకి. దానికొకపిల్ల. ఈ రోజుల్లో అందరిపిల్లలూ చదువుకుంటూవుంటే, నా పిల్లకిమాత్రం ఏమితక్కువని కాకి, పిల్లని బడికిపంపి చదువు చెప్పించింది.

గొంతు బాగున్నవాళ్లూ, బాగులేని వాళ్లూకూడా సంగీతం నేర్చుకోవడం చూసి, నాకూతురికీ సంగీతం చెప్పిస్తానని కాకి, పిల్లకి సంగీతం చెప్పించింది.

అందంవున్నవాళ్లూ, లేనివాళ్లూకూడా నాట్యం నేర్చుకుంటూ వుంటే, నా పిల్లమాత్రం తీసిపోయిందా ఏమిటని, కాకి, పిల్లకు నాట్యం నేర్పించింది. ఇలా మూడు విద్యల్లో కాకి తనపిల్లని తయారుచేసింది. ఎలాగైనా, కాకిపిల్ల కాకికి ముద్దు గదా!

ఇలా వుంటుండగా, కాకిపిల్ల ఒక రోజున ఒక మాంసంముక్క తెచ్చుకొని, చెట్టుకొమ్మమీద కూచుని నములుతోంది. అది ఒకనక్క చూసింది. నక్కకి జిత్తులు పుట్టుకతో వచ్చిన బుద్ధులుగదా. కాకిపిల్లను మోసంచేసి, ఎలాగయినా ఆ మాంసంముక్క కాజేదామనుకుంది.

కాకిపిల్ల కూచున్న చెట్టు దగ్గరికి వెళ్లి కాకిపిల్లనుచూసి "ఏం, మరదలా బాగా చదువుకున్నావా?" అని అడిగింది.

కాకిపిల్ల చదువులు నేర్చిందికదా! అంచేత నక్కజిత్తులు దానికి తెలుసు. పైగా, పూర్వం ఒకనక్క, ఒకకాకిని మోసంచేసి దానినోట్లోవున్న మాంసం ముక్కను కాజెయ్యడం కథకూడా కాకిపిల్ల రెండోక్లాసులో చదువుకుంది.

రచన: సత్యం



నక్క తనఎత్తు సాగలేదని, ఇంకా కొంచెం పెద్దఎత్తు వేదామనుకున్నది.

"మరదలా, నువ్వు సంగీతం నేర్చుకున్నావట. బాగా పాడగలవట. నాకు సంగీతం అంటే చాలాయిష్టం. ఒక్క పాటపాడు, మరదలా", అందినక్క.

పొగడ్త అంటే ఎవరైనా చెవికోసుకుంటారు కదా! నక్క పొగడ్తకు కాకిపిల్ల కొంచెం ఉబ్బిపోయి పాట పాడింది.

అయితే, చదువుకున్న కాకిపిల్ల కదూ! అంచేత, నోట్లోవున్న మాంసం ముక్కను ముందుగానే తన కాలి గోళ్లతో తీసి పట్టుకుని పాట పాడింది.

నక్కకోరిక, పాపం, ఈసారీ నెరవేరలేదు. కాకిపిల్లను మోసం చెయ్యడం ఎలాగా అని ఆలోచించి, ఇంకాస్త పెద్దయెత్తు వేదామని, ఇలా అంది. "మరదలా, ఎంత బాగాపాట పాడేవే! ఆహాహా. నాచెవులతుప్పువదిలిపోయిందే.

అంచేత నక్కమోసం కాకిపిల్లకి తెలుసు. నక్కఅడిగిన ప్రశ్నకు జవాబు చెపితే, తను నోరు తెరవాలిసి వస్తుంది. అప్పుడు నోట్లో మాంసం ముక్క క్రిందపడిపోతుంది. దానిని కాస్తా నక్కనోట్లో వేసుకు పోతుంది. ఆసంగతంతా కాకిపిల్ల, చదువుకున్నది కనుక, ఆలోచించుకుని, నక్క అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పకుండా, అవునని తలవూపింది

కాని, ఇంకొక్క కోరికకూడాతీరుద్దూ. నువ్వు నాట్యం నేర్చుకున్నావుట. చాలా బాగా నాట్యం చేస్తావట. ఒక్కసారి నాట్యంచేద్దూ; చూసి ఆనందిస్తాను."

ఈమాటలు వినేటప్పటికి కాకిపిల్ల ఉబ్బి, తబ్బిబ్బయిపోయింది. తన సంగీతాన్నీ, నాట్యాన్నీ మెచ్చుకొనేవాళ్లు ఎవరూ లేరనుకుంటూవుంటే, నక్కబావ యింతగా మెచ్చుకుంటున్నాడు. నక్కబావను సంతృప్తి పరచాలనుకున్నది.

అయితే మరి, మాంసంముక్క మాటో! చదువుకున్న కాకిపిల్లకదా! అంచేత, ఆహారం విషయంలో అజాగ్రత్త పనికిరాదని దానికి తెలుసు.

అందుకని, బాగా ఆలోచించి గోళ్లతో పట్టుకున్న మాంసంముక్కను మళ్లీ నోట్లోపెట్టుకొని, నాట్యంచేసింది.

కాకిపిల్ల నాట్యం చేస్తూవున్నంత సేపూ, నక్కకు ఒకటే ఆలోచన ఆ మాంసంముక్కనెలా కాజేద్దామా అని!



ఇంతకూ దాని ఎత్తు పారనేలేదు. కాకిపిల్ల నాట్యం అయినతరువాత, నక్క ఆఖరి యెత్తు వేదామని ఇలా అంది.

"మరదలా! ఆహాహా. ఎంత మంచిపాట పాడావు; ఎంతబాగా నాట్యం చేశావు! నిజంగా యివ్వాళ నాకు సుదినం. అయితే, ఇంకొక్క చిన్నకోరిక వుంది. అదికాస్తా తీర్చావంటే, అపరిమితమయిన ఆనందంతో ఇంటికి వెళతాను. ఇవ్వాళనేను పొందేతృప్తికి,

ఇహ నాకు యీనాటికి అన్నంకూడా అక్కరలేదు. అయితే మరదలా, ఆ నాకోరిక ఏమిటంటే, నీ ఆటా, పాటా, కలిసి చూడాలనివుంది. పాట పాడుతూ నాట్యంచెయ్యి, మరదలా! హాయిగా ఆనందిస్తాను."

కాకిపిల్ల, నక్కపొగడ్తకు చెప్ప లేనంత పొంగిపోయింది.

కాని పాటపాడుతూ, నాట్యంచేస్తే, మాంసంముక్కను ఏంచెయ్యాలి? చదువుకున్న కాకిపిల్ల కదా! ఆలోచించి, నక్కబావతో ఇలా అంది.

"నక్కబావా! పాడీ, నాట్యంచేసీ ఇప్పటికే అలసి పోయాను. ఇంకా పాట పాడుతూ, నాట్యం చెయ్యాలంటే, వంట్లోశక్తి వుండాలి కదా! అంచేత, యీ మాంసం ముక్కను కాస్తాతిని, నీకోరిక తీరుస్తాను వుండు."

ఈ మాటలువినేటప్పటికి నక్కకు, ఇకలాభం లేదనిపించింది. ఆమాంసం ముక్క కోసమేకదా కర్ణకఠోరమైన కాకిపిల్లపాట విన్నదీ, అసహ్యమైన నాట్యాన్ని చూసిందీ అనుకొని, "మరదలా, మళ్ళీవస్తాను. ఈలోపల నువ్వు మాంసంముక్క తినడం కానీ" అని చెప్పి, బయలుదేరింది.

కాని, కాకిపిల్ల అంతటితో వదులుతుందా? మాంసంముక్క గుటుక్కున మింగి, పోతున్న నక్కబావను పిలిచి, సంగీతం పాడుతూ నాట్యం చెయ్య సాగింది.



# తోకలేని తిమ్మరాజు

తిమ్మన్న కోతిమూకలకు రాజు. అది వొక వూరిదగ్గిర మిట్టమీద వుంటూ వుండేది. అది చేసే దుండగాలు యిన్నీ అన్నీకావు. పిల్లలేమిటి పెద్దలేమిటి దానిపేరుచెప్పితే భయపడనివాళ్లు లేరు.

తిమ్మన్న తన కోతి సమూహాన్ని వెంటేసుకుని ఆ చుట్టుపట్లవున్న తోటల్లోపడి అందిన పళ్లూ, కాయలూ, తిన్నన్నితిని, మిగతావి కొరికి కింద పారేసి చెట్లన్నీ ధ్వసం చేస్తుండేది.

ఒకరోజున తిమ్మన్న తిమ్మపల్లె వచ్చింది. వచ్చి అక్కడ వొక పాడు బడిన గోడమీద కూర్చుని, "ఈ వూళ్లో వాళ్లని ఏవిధంగా యేడిపిద్దామా" అని తీరిగ్గా ఆలోచిస్తూ కూర్చుంది. తిమ్మన్న పొడుగాటితోక గోడ రెండోవైపున వేళ్లాడుతూ వుంది. అక్కడ నాగజెముడు కంప వున్నసంగతి పాపం తిమ్మన్నకి తెలియదు. ఇంతలో ఒక పిల్లవాడు అటుపోతూ చేతులోవున్న జామకాయ విసిరివేశాడు. అది తీసుకోటానికి తిమ్మన్న ఎగిరిదూకి జామకాయ తీసుకుని తిందామని కూర్చుంది. ఇంకేం, అక్కడ ఒక రక్కిసముల్లు ఉండి తోక మొదట్లో గుచ్చుకుంది. తిమ్మన్న కెవ్వన కేక వేసి ఎగిరి అవతల దూకింది. ఆ ముల్లు లాగాలని ఎన్నో తిప్పలుపడింది కాని అది రాలేదు.

తిమ్మన్న ఇలా అవస్థపడుతూండగా, అవూరి మంగలి తిమ్మప్ప ఆ దారినే పోతూ తిమ్మన్నను చూచాడు. చూచి, "అదేమిటోయ్ తిమ్మన్నా. ఏమి టిలా పీక్కుంటున్నావ్? ఏమిటి సంగతి?" అని అడిగాడు.

"మంగలి మామా, పాడు ముల్లొకటి నాతోకలో గుచ్చుకుందోయ్."అన్నది.





"ఓస్, యింతేగదా! నే తీసేస్తాలే వుండు" అన్నాడు మంగలి.

"బాబ్బాబు, నీకు పుణ్యంవుంటుంది. తీద్దూ" అని తొందరచేసింది తిమ్మన్న.

"తీస్తా, తొందరపడమాకు. నువ్వు కదలకుండా, మెదలకుండా కూర్చోవాలి సుమా అట్లాగైతేనే తీస్తా; లేకపోతే నావల్లకాదు" అన్నాడు మంగలి.

"ఓ ఇంతేకదా భాగ్యం! నువ్వు ఏం చెప్పితే అది చేస్తా. రాతిబండకిమల్లే కూర్చుంటా, సరేనా?" అంది తిమ్మన్న.

మంగలి పొదిలోంచి కత్తితీసి నెమ్మదిగా ముల్లు గుచ్చుకున్నచోట బొచ్చు గొరగబోయినాడు. కత్తి తోకకి తగలగానే తిమ్మన్న ఒక్కమాటు ఎగిరి పడింది. ఇంకేం, తోక సర్రున తెగిపోయింది. వెంటనే తిమ్మన్న మంగలి చెయ్యి లటికించుకుని "ఓరి నీ చెయ్యి విరగ! తిమ్మన్నరాజు తోక తెగగొయ్యటానికి నీకు చేతులెల్లా వచ్చాయిరా! దుర్మార్గుడా! మళ్ళీ నాతోక నాకు పెట్టనన్నా పెట్టు, లేకపోతే ఆ కత్తైనా యిచ్చిపో" అని నిలవేసింది.

"తిమ్మన్నా, ఇందులో నా తప్పేముంది చెప్పు. నువ్వు కదిలావు, తోక తెగింది. నేనేం కావాలని తెగ్గోశానా? నా బ్రతుకు ఈ కత్తితోనే వుందే, అది ఇస్తే నా గతేంకావాలి చెప్పు?" అని అన్నాడు మంగలి విచారంగా.

"నువ్వు బతికితేనాకేం చస్తే నాకేం! నా తోక కోసినందుకు నీ కిది శాస్తి" అంటూ తిమ్మన మంగలి చేతిలోంచి కత్తి లాక్కుని వుడాయించింది.

"తిమ్మన్న కొంత దూరంవచ్చి, అక్కడొక మర్రిచెట్టు నీడన కూర్చుని తెగిన మొండితోక చూసుకుందామని



ప్రయత్నించింది. కాని కనిపించలా.

ఇంతలో అక్కడికొక మామిడి పళ్లమ్మి పళ్లతట్ట నెత్తిన బెట్టుకుని వచ్చి, చెట్టునీడనకూర్చుని తట్టలోపండు ఒకటి తీసుకుని తినటం మొదలెట్టింది. తిమ్మన్న ఆ అమ్మితో "అమ్మీ, అమ్మీ, అదేమిటీ అట్లా నోటితో కొరుక్కుని తింటావేం? చక్కగా కత్తితో తోలుతీసి, సన్నని ముక్కలు కోసుకుని తినరాదూ" అన్నది.

"తిమ్మన్నా! బీదముండని. నాకు చాకులూ కత్తులూ, ఎక్కడ్నుంచొస్తయ్" అన్నది పండ్లమ్మి.

"నాదగ్గిర వొక మంచి కత్తివుంది. కావాలంటే కాసిని కాయలు కోసుకు తిను. ఇంతలోకే యేం అరిగిపోతుంది గనకనా"అని తిమ్మన్న కత్తి ఇచ్చింది.

పండ్లమ్మి నాలుగైదుపళ్ళు కోసుకు తిన్నది. ఒక్క ముక్కకూడా తనకి పెట్టడంలేదే అని తిమ్మన్నచూస్తూంది. పండ్లమ్మితిరిగి కత్తి తిమ్మన్నకిచ్చింది.

తిమ్మన్న కత్తివంక చూచి, "ఎంత నంగనాచివమ్మా, కత్తి అంతా మొండి చేసి యిస్తున్నావే! నే నిచ్చినప్పుడు తళతళ మెరుస్తున్నదే, యిప్పు డెట్లా వుందో చూడు. పదునంతా పోయింది. నా కక్కర్లేదు, పాడుకత్తి. నువ్వే వుంచుకో. కత్తికి బదులు ఆ పళ్లతట్ట యిచ్చివెళ్ళు"అన్నది తిమ్మన్న దర్జాగా.

పాపం, పళ్లమ్మి తెల్లబోయింది. "తిమ్మన్నా! నేనేం గొంతులో కొట్టుకోనా యీ కత్తితీసుకుని. ఏదో, యీ పళ్లమ్ముకుని నాలుగు డబ్బులు సంపాయించుకుని పొట్టపోసుకోవాల్సినదాన్ని నేను. నా నోట్లో మట్టికొట్టకు"అన్నది పండ్లమ్మి.





"నువ్వు నీ నోట్లో మట్టే కొట్టుకుంటావో, బంగారమే కొట్టుకుంటావో నాకెందుకూ? నా మామూలుకత్తి నా కిచ్చినాసరే లేకపోతే పండ్లతట్ట యిచ్చి వెళ్లినా సరే" అన్నది తిమ్మన్న.

"ఇదేం తంటారా భగవంతుడా" అని పండ్లమ్మి విచారిస్తూండగా, తిమ్మన్న తట్ట లంకించుకుని అక్కణ్ణించి ఉడాయించింది.

పళ్లతట్టతో తిమ్మన్న వొక బీడు దగ్గిరికొచ్చింది. అక్కడొక 10 యేళ్ల పిల్ల వొక యెద్దుని మేపుతోంది. ఆ పిల్ల చాలా నీరసంగా వుండటంచూచి "ఏంపిల్లా. అలా నీరసంగా వున్నావేం? ఆకలవుతోందా?" అని అడిగింది.

"అవును తిమ్మన్నా. ప్రొద్దుట చద్దిబువ్వకూడా తినకుండా వచ్చానివ్వాళ. మాచెడ్డ ఆకలేస్తోంది" అన్నది పిల్ల.

"అలాగనా, పాపం. ఇవిగో నా దగ్గిర మంచి మామిడిపళ్లు తట్టెడున్నయ్యి. నీకు కావల్సినన్ని తిను," అని పళ్లతట్ట పిల్లకిచ్చింది తిమ్మన్న.

పిల్ల ఆత్రంకొద్దీ, పళ్ళువరసబెట్టి తినటం మొదలెట్టింది. ఇంకా తట్టలో నాలుగైదు పళ్ళు వున్నయ్యనంగా, తిమ్మన్న గయ్, గయ్‌మంటూ లేచింది. "ఏంపిల్లా, పిట్టకొంచెం, కూతఘనం అన్నట్లు, లొడితెడులేవు బుట్టెడు పళ్లెల్లా తిన్నావ్? ఏదో దయతలచి తినమన్నానుగదాఅని అన్నీ తిని కూచున్నావ్, భలేదానివిలే. నా పళ్ళునాకు కక్కు. లేకపోతే ఆఎద్దునుయిచ్చెయ్యి" అన్నది తిమ్మన్న.

పాపం పిల్ల బిక్కమొగం వేసింది. "తిమ్మన్నా. ఎందుకలా కోప్పడతావు. నువ్వు తినమంటేనేగా తిన్నాను. ఎద్దుని

తిరిగి యింటికి తీసుకెళ్లకపోతే మా అమ్మానాన్నా నన్ను చితకబొడుస్తారు, తిమ్మన్నా. నన్ను వొదిలిపెట్టు" అన్నది పాపము పిల్ల కన్నీళ్ళుకారుస్తూ.

కాని తిమ్మన్నకు జాలికలగలేదు. పిల్ల చేతులోవున్న తాడు లంకించుకుని ఎద్దుని లాక్కుపోయింది. పాపం పిల్ల, బోర్లపడి యేడుస్తూ ఉండిపోయింది.

ఎద్దుని తీసుకుని వస్తుండగా తిమ్మన్నకు వొక నూనెగానుగ కన్పించింది. గానుగకి ఒకటే ఎద్దుకట్టివుంది. రెండో ఎద్దుకుబదులు తెలకవాడే గానుగ లాగుతున్నాడు. "ఏమండోయ్ తెలకల బావ గారూ. ఈ వుద్యోగం ఎప్పట్నించీ!" అని అడిగింది తిమ్మన్న.

"ఏంచేసేది తిమ్మన్నా! రెండో యెద్దు నిన్ననే చచ్చింది. గానుగ ఆడితేనేగా డొక్కాడేందుకు. అందుకని నాకీ ఖర్మ" అన్నాడు తెలకవాడు.

"అలాగటోయ్! నాదగ్గిర యిదుగో ఈ ఎద్దువున్నది. కావలిస్తే ఇవ్వాల్టికి నీగానుగ ఆడించుకో." అంది తిమ్మన్న.

"చాలా మంచివాడివి తిమ్మన్నా!



సాయంత్రంలోపల పీయెద్దుని నీకిస్తాలే" అన్నాడు తెలకవాడు.

తిమ్మన్న సాయంత్రం తెలకవాడి దగ్గిరికి వచ్చింది. తెలకవాడు ఎద్దును తిరిగి యిచ్చేశాడు. తిమ్మన్న ఎద్దువంక ఎగాదిగాచూసి, "ఏమోయ్ తెలకలబావా! డొక్కలు పీక్కుపోయేదాకా పని చేయించుకుని యిస్తున్నావా నా ఎద్దును నాకు. చూడు, యిప్పుడో యింకా కాసేపటికో చచ్చేటట్లుంది. నువ్వే వుంచుకో, నాకక్కర్లేదు. నా ఎద్దుకు బదులు నీవు ఆడించిన నువ్వుల నూనంతా నాకిచ్చెయ్యి" అన్నది.



తెలకలవాడు తెల్లబోయి "తిమ్మన్నా. ఇలాగనటం నీకు న్యాయమేనా? నూనె యిస్తానని నేను చాలామంది దగ్గిర డబ్బులుకూడా ముందుగా తీసుకున్నానే. నూనె యివ్వకపోతే నన్ను బతకనిస్తారా. క్షమించు, నూనె యివ్వలేను" అన్నాడు.

"ఏమిటీ, ఇవ్వలేవూ? ఎలా ఇవ్వవో చూస్తా" అంటూ తిమ్మన్న నూనెచట్టి నెత్తిన బెట్టుకుని దౌడు తీసింది.

తిమ్మన్న నూనెచట్టి నెత్తిన బెట్టుకుని వస్తుండగా, దోవలో వో ముసలి అవ్వ అట్లు పోస్తున్నది. తిమ్మన్న అవ్వ పక్కకుపోయి కూర్చుని "అవ్వా, నువ్వు దోసెలు కుప్పలు కుప్పలుగా పోస్తున్నావేగాని, కమ్మని వాసనరాదేం. ఇలాంటివి ఎవరుకొంటారు నీ దగ్గిర! మంచి పప్పునూనెతో తయారుచేస్తే ఎంతోమంది వస్తారు కొనటానికి" అన్నది.



"తిమ్మన్నా, నువ్వు చెప్పేది నిజమే. కాని బీదముండని, మంచి పప్పునూనె ఎక్కణ్ణుంచి తేను?" అన్నది అవ్వ.

"అవ్వా, నీకు నిజంగా కావల్సివుంటే ఇదుగో నా దగ్గర చట్టెడు మంచినూనె వున్నది. నీకు కావాల్సినంత వాడుకో. నాకుమాత్రం ఒక్కటంటె వొక్క దోసె పెట్టు, చాలు" అన్నది తిమ్మన్న.

అవ్వ సరేనని, నూనె తీసుకుని దోసెలు పొయ్యటం మొదలుపెట్టింది. అవ్వదగ్గిరవున్న పిండి అంతా అయిపోయింది. చట్టిలో నూనెకూడా సగానికి పైగా అయిపోయింది. అవ్వ చట్టి తిరిగి తిమ్మన్న కిచ్చేసింది. తిమ్మన్న చట్టిలోకి తొంగిచూసి: "అవ్వా, ఏమో ననుకున్నా, భలేదానివే. ఈ కాస్తనూనె నేనేంచేసుకోను నువ్వేవుంచుకో. నువ్వు

పోసిన ప్రతి దోసెలోనూ నా నూనె వున్నది. అందుకని దోసెలు నావీ, మిగిలిన నూనె నీది" అన్నది.

అవ్వకు ఏమీ తోచలా. పొయ్యి వూదే గొట్టంతో దేహశుద్ధి అయితేగాని తిమ్మన్న వదలదనుకొని, గొట్టంకోసం పొయ్యివేపు తిరిగింది. ఇదే సందు గదాఅని తిమ్మన్న, దోసెల దొంతర నెత్తిన బెట్టుకుని వొకే పరుగుతీసింది.

దోవలో తిమ్మన్నకి వొక మనిషి రండోలు మోసుకొస్తూ కనిపించాడు. తిమ్మన్న "ఏం, రండోలు బావా! ఎక్కడికి ప్రయాణం ?" అని అడిగింది.

"ఇక్కడికేనోయ్ తిమ్మన్నా. పక్కవూరిలో పెళ్ళికి పిలిచారు" అన్నాడు రండోలువాడు. సరేనని యిద్దరూ కలిసి నడుస్తున్నారు.

ఇంతలోకే వొక యేరు దగ్గిరికి వచ్చారు. తిమ్మన్న రండోలువాడితో, "రండోలుబావా. చాలాదూరం వచ్చాం. కాళ్ళు లాగుతున్నయ్యి కదూ? కమ్మని దోసెలు కాసిని తిని, ఆ యేట్లో నీళ్ళు కడుపునిండా తాగితే ఎంతో హాయిగా ఉంటుందికదూ ?" అన్నది.

"నిజమే ; కాని యీ నట్టడవిలో మనకి దోసెలేం ఆకాశాన్నించి రాల్తాయా ?" అన్నాడు రండోలువాడు.

"ఆకాశాన్నించి రాలట మెందుకోయ్. మనదగ్గిరలేకపోతేగా ! ఇవిగో నాదగ్గిర బోలెడు కమ్మటిదోసెలున్నై. కాళ్ళూ, చేతులూ కడుక్కురా, తిందాం" అన్నది తిమ్మన్న.

సరేనని రండోలువాడు కాళ్ళుచేతులు కడుక్కొనివచ్చి, దోసెలు తీసుకుని తినటం మొదలుపెట్టాడు. తిమ్మన్న మాత్రం పక్కన చూస్తూ కూర్చున్నది.



రంకోలువాడు వంచిన తల యెత్తకుండా దోసెమీద దోసె గొంతుదాకా మెక్కాడు. తిమ్మన్న అదిచూసి మండిపడుతూ - "చాల్లేవయ్యా! భలే పెద్ద మనిషివి. ఏదో పుణ్యానికి కాసిని తినమంటే అన్నీతింటావా? నాదోసెలన్నా నాకుతే. లేదా నీ డోలన్నా నాకివ్వు" అన్నది.

డోలువాడు గుడ్లు వప్పజెప్పకూచున్నాడు. గొంతువరకూ మెక్కటం చేత అతనికి నోటంట మాటకూడా రాలేదు. ఏంచెయ్యటంరా భగవంతుడా అని ఆలోచిస్తూండగా, తిమ్మన్న డోలు లంకించుకుని వొక్క పరుగున తన కోతిసమూహం దగ్గరికొచ్చి చేరుకుంది.

కోతులన్నీ తిమ్మన్నరాజును చూడగానే లేచినిల్చుని సలాంచేసినై. కోతుల మంత్రి, "రాజా, ఈవేళ తమరుచేసిన ఘనకార్యాలు సెలవిస్తే చెవులారా విని ఆనందిస్తాం" అన్నాడు.

"సరే, అంతా కూర్చోండి" అని తిమ్మన్నరాజు డోలమీద దరువేస్తూ యిలా పాటపాడేదు:—

తోకపోయి కత్తివచ్చె ఢం, ఢం, ఢం
కత్తిపోయి పళ్లువచ్చె ఢం, ఢం, ఢం
పళ్లుపోయి ఎద్దువచ్చె ఢం, ఢం, ఢం
ఎద్దుపోయి నూనెవచ్చె ఢం, ఢం, ఢం
నూనెపోయి దోసెలొచ్చె ఢం, ఢం, ఢం
దోసెలుపోయి డోలువచ్చె ఢం, ఢం, ఢం
ఢం, ఢం ఢం. ఢం, ఢం, ఢం. ఢం, ఢం, ఢం.

ఇది వినంగానే కోతులన్నీ ఎగిరి గంతులెయ్యటం మొదలుపెట్టినై. అడవి అంతా కోతులగోలతో మారు మోగిపోయింది.





బాబు రాజేంద్రప్రసాద్

(మన భారతదేశపు కాంగ్రెసు అధ్యక్షుడు)



దమయంతి - హంస

చిత్రకారుడు — మా. గోఖలే



# నల దమయంతి



పూర్వం నిషధదేశానికి నలుడు రాజుగా వుండేవాడు. భరతఖండాన్ని ఏలిన అరుగురు చక్రవర్తులలోనూ ఈ నలమహారాజు ఒకడు. ఇతని పెళ్లి చాలా చిత్రంగా జరిగింది.

ఒకనాడు నలుడు వనవిహారంచేస్తూ వుండగా ఒక హంస అతనికి చిక్కింది. ఈ హంస నలుడిదగ్గిర విదర్భదేశపు రాజు కూతురైన దమయంతి అందచందాలూ, గుణగణాలూ వర్ణించింది. నలుడు దమయంతిని మోహించేటట్టు చేసింది.

ఆ తరువాత ఆ హంస విదర్భకువెళ్లి నలుడికి చిక్కినట్టుగానే దమయంతికి కూడా చిక్కి ఆమెదగ్గిర నలుడి అందచందాలూ, గుణగణాలూ పొగడింది. దమయంతికికూడా నలుడిమీద మోహం కలిగింది. ఈ హంసరాయబారం ఫలితంగా నల దమయంతులిద్దరూ ఒకరినొకరు వివాహంచేసుకోవాలని నిశ్చయించుకున్నారు.

ఇంతలో విదర్భదేశపురాజు తన కూతురైన దమయంతికి స్వయంవరం చాటించాడు. ఈ చాటింపువిని నానాదేశాల రాజులూ బయలుదేరి వచ్చారు. ఆఖరుకు స్వర్గంనుండి దిక్పాలకులైన ఇంద్ర, అగ్ని యమ,వరుణులుకూడారథాలెక్కి వచ్చారు. దమయంతిని చాలారోజులుగా మోహించినవాడు గనక నలుడుకూడా రథమెక్కి స్వయంవరానికి బయలుదేరాడు.

దారిలో దిక్పాలకులు నలుణ్ణి కలుసుకుని అతన్ని పరీక్షించటానికి ఒక కోరిక చెల్లించమని కోరారు. దమయంతి తమలో యెవరినైనా పెళ్ళాడేటందుకు నలుణ్ణి రాయబారం వెళ్లమన్నారు. మాటఇచ్చాడు గనక నలుడు ఒప్పుకుని రహస్యంగా దమయంతి దగ్గిరికివెళ్ళి దిక్పాలకులకోరిక ఆమెకు తెలియజేశాడు. కాని దమయంతి ఒప్పుకోలేదు. ఆమె నలుణ్ణే ప్రేమించింది.

స్వయంవరాని కందరూవచ్చి కూర్చున్నారు. చేతిలో పూలమాల పట్టుకుని దమయంతి సభలోకి వచ్చింది. ఆచారం ప్రకారం ఒక చెలికత్తె ఆమెకు ప్రతి రాజునుగురించీ వర్ణించటం ప్రారంభించింది. దమయంతి ఒక్కొక్క రాజునే దాటి ముందుకు రాసాగింది. ఇంతలో ఒకచోట చెలికత్తెకు వరుసగా అయిదుగురు నలమహారాజులు కనిపించారు. అందులో నిజంగా ఒకడే నలుడు. మిగిలిన నలుగురూ ఇంద్రాగ్ని యమ వరుణులు.

ఈ అయిదుగురినీ చూడగానే దమయంతి దిగ్భ్రమచెంది, నిజమైన నలుణ్ణి చూపమని దిక్పాలకులను ప్రార్థించింది.



ఆమె అచంచలప్రేమకు మెచ్చుకుని దిక్పాలకులు తమ యథార్థస్వరూపాలు ధరించారు. దమయంతి పూలమాల నలుడి మెళ్లోవేసింది.

కొంతకాలంపాటు నలుడు దమయంతితో సుఖంగా దేశాన్ని పరిపాలించాడు. కాని కొంతకాలానికి నలుడు తన దాయాది అయిన పుష్కరుడితో జూదమాడి తన రాజ్యం కోల్పోయినాడు. కట్టుబట్టలతో నల దమయంతులు అడవులుపట్టి పోయినారు. కట్ట గుడ్డలేకా, తిన తిండిలేకా ఇద్దరూ అష్టకష్టాలూ పడ్డారు. నలుడు దమయంతిని విదర్భకు వెళ్ళిపొమ్మన్నాడు గాని దమయంతి భర్తతోపాటు కష్టాలు పడటానికే నిశ్చయించుకున్నది. తనవెంట వుండటంవల్ల దమయంతి కష్టాలుపడుతున్నదనీ, తాను లేకపోతే పుట్టింటికి వెళ్లిపోతుందనీ గ్రహించి నలుడు ఒకరాత్రివేళ దమయంతిని ఒంటరిగా విడిచి వెళ్లిపోయినాడు.

దమయంతి భర్తకోసం చాలా దుఃఖించింది. యెన్నోప్రయాసలుపడి ఆఖరుకు విదర్భ చేరుకున్నది. వెంటనే నలుణ్ణి వెతికించటానికి అన్నివేపులా మనుషులను పంపించింది.

దమయంతిని విడిచిన తరువాత నలుడు అరణ్యంలో పోతూవుండగా ఒక పాము కరిచింది. ఆ విషానికి అతని శరీరమంతా నల్లగా అయిపోయింది. అతను గుర్తుపట్టలేకుండా మారిపోయినాడు. ఈ అవకాశం చూసుకుని నలుడు బాహుకుడనే పేరుతో రుతుపర్ణ మహారాజుదగ్గిర వంటలవాడుగా




చేరాడు. నలుడు వంటచేయటంలోకూడా గొప్ప నేర్పరి. నలపాకం, భీమపాకం అనే మాటలు మీరు వినేవుంటారు.

దమయంతి పంపినవారిలో ఒక బ్రాహ్మడు రుతుపర్ణుడి రాజ్యానికి వచ్చాడు. బాహుకుణ్ణి చూచాడు. అతను నలుడే అయివుండాలని పసికట్టాడు. ఈవార్తపట్టుకుని విదర్భవెళ్ళాడు.

బాహుకుడు నలుడవునో కాడో తేల్చుకోవటం ఎట్లా? దమయంతి ఒక చక్కని ఉపాయం పన్నింది. నలుడికి 'అశ్వహృదయం' అనే విద్యతెలుసు. అతను గుర్రాలను వాయువేగంతో తోలగలడు. అందుచేత కాలవ్యవధిలేకుండా రుతుపర్ణుణ్ణి విదర్భకు రప్పించితే రథాన్ని తోలటానికి నలుడు పూనుకుంటాడు. ఈ ఉద్దేశంతో దమయంతి తాను తిరిగి పెళ్లాడబోతున్నాననీ స్వయంవరానికి రావలసిందనీ రుతుపర్ణుడికి కబురు పంపింది.

మర్నాడే స్వయంవరం. రుతుపర్ణుడు యెక్కడోవున్న విదర్భకు ఒక్కరోజులో యెట్లాపోతాడూ? రాజుగారివిషయం విచారించటంచూసి బాహుకుడు తాను సారథ్యం చేసి రుతుపర్ణుణ్ణి ఒక్కరోజులో విదర్భ చేరుస్తానని చెప్పాడు. తనభార్య మరొకరిని పెళ్లాడుతుందని విని నలుడికి పాపం చాలా కష్టంవేసింది. ఈపెళ్లి చూడటానికే అతను సారథ్యానికి ఒప్పుకున్నాడు.

బాహుకుడి సారథ్యంవల్ల రుతుపర్ణుడు సకాలానికి విదర్భ చేరుకున్నాడు. కాని దమయంతి స్వయంవరం అబద్ధమనీ, బాహుకుడే నలుడని రుజువుచెయ్యటానికే ఈయెత్తు వేశారనీ రుతుపర్ణుడు తెలుసుకున్నాడు.

ఇంద్రుడి దయవల్ల నలుడు తనపూర్వరూపం సంపాదించాడు. పుష్కరుడు ప్రజలను చాలా అన్యాయంగా పరిపాలించటంవల్ల అతన్ని ప్రజలు చంపేశారు. నలుడు విదర్భలో ఉన్నాడని విని నిషధదేశప్రజలు అతనిదగ్గిరికివచ్చి మళ్ళీ యెప్పటిలాగే రాజ్యం చెయ్యమని ప్రార్థించారు. నలుడు వారుకోరినప్రకారం తిరిగి నిషధదేశానికి రాజై దమయంతితో చిరకాలం సుఖంగా జీవించాడు.






నేను చెన్నపట్నంలోని రాయపేటలో పుట్టాను. దినగండం నూరేళ్ళాయుష్షన్నట్టుండేది నా తలిదండ్రుల బ్రతుకు. ఎంత కాలమని అలా జరుగుతుంది చెప్పండి. నాకింకా ఏడాదైనా వెళ్లిందోలేదో, నా తలిదండ్రులిద్దరూ, బడితెపూజ జరిగి, కిక్కురుమనకుండా ఒకేసారి అకాలమరణం పాలైనారు. అప్పట్నుంచీ నేను కాస్త ఒళ్లు దగ్గిర బెట్టుకుని మెసులుతూ వస్తున్నాను, వాళ్ల గతే నాకూ పడుతుందేమోనని.

మేము రాయపేటలో వుంటున్నది ఒక పాతయిల్లు. ఇల్లు పాతదైనప్పటికీ ఆ ఇంటో నేల అంతా కడపరాళ్లుపరిచి వుండటాన మా రహస్య వాకిళ్లు మినహా అంతా చెక్కు చెదరకుండా వుంది. అందువల్ల మేము మరో జాగా చూసుకోవలసిన అవసరం ఈనాటికీ లేకుండా జరిగిపోతోంది. 'మేము' అనటంలో, నేనూ, నాభార్యా, పిల్లా, జెల్లా అంతా అక్కడే కాపరం వుంటున్నామని మీరు గ్రహించే వుంటారు.

మా యిల్లు ఎంత శాశ్వతంగా బందోబస్తుగా వుందో, మా నిత్యజీవితంకూడా అలా ప్రశాంతంగానే వెళ్లిపోతూ వుంది.

పట్నంలో పనిచేసే ఉద్యోగులకైనా యింకా జీవితంమీద విరక్తి వుంటుందేమో కాని మాకు మాత్రం ఏదిగులూ లేదు. ఎందుకంటే, పట్నంలో ఉద్యోగులకుమల్లే మేము పగలల్లా ఎండనక వాననక చెమటకార్చుకుంటూ పనిచేసి, చచ్చి సగమై యింటికిచేరాల్సిన కర్మ పట్టలేదు. మా ఉద్యోగం చల్లటి రాత్రివేళ కనక ఈ యిబ్బందులేవీ వుండవు.

నిజానికి ఆలోచించిచూస్తే పట్నం పగలల్లా అలా నిత్యకళ్యాణం పచ్చతోరణం అన్నట్లు కళకళలాడుతూ వుందంటే పాపం ఆ ఉద్యోగుల చలవేకదా. వాళ్లకు సహాయంగా, ట్రాములూ, బస్సులూ, రిక్షాలూ, లాగుడుబళ్ళూ, అమ్ముకునేవాళ్ళ కేకలూ, ఒకటేమిటి రకరకాల సందడీ ఉంటుంది. కాని, వాళ్ళు ఎంతసేపని అలా సందడిచేస్తూ వుండగలరు చెప్పండి. రాత్రి 11, మహామించితే 12 గంటలకు పైన ఎక్కడివా రక్కడ చప్పగ నిద్రపోతారు, పట్నాన్ని పాడుబడ్డదానిలాచేసి.

పగలల్లా అలిసేవరకూ వాళ్లు చేతనైనంత సందడిచేశారు. ఇక అపైన ఆసందడి తగ్గకుండా చూచుకోవలసిన బాధ్యత ఎవరో వకరు నెత్తినవేసుకోవాలా వద్దా? యెవరు వేసుకుంటారు చెప్పండి. విధిలేక మానెత్తిన వేసుకున్నాము.

మమ్మల్ని యెందుకనో అందరూ అతి చులకనగా చూస్తారు. మాకు మాత్రం అన్నీ అమరినఇళ్లు లేవనా, వాకిళ్లు లేవనా! గట్టిగా గాలివానవస్తే కుప్పకూలేట్టుంటుంది మేమున్న యిల్లు. మరి అలాంటిదాంట్లో వుంటూనే అంతగర్వం దేనికో మాఇంటో వుండేవారికి? నిజం అలోచిస్తే, మా యిల్లు వాళ్లదానికన్న ఎన్నిరెట్లు నిశ్చింత అయిందో చూడండి. పిడుగుపడ్డా మాకు చలనం వుండదు. ఇకమావాకిళ్లు అంతంతమాత్రపు వాళ్లకి అంటుదొరికేవిగాకూడా వుండవు. మేము నివసించేచోటు అంత భయం లేంది.

ఇక మా దినచర్య అంటారూ - ఆబ్బో, లెక్కలేనన్నిపనులు. చీకటిపడిందంటే సరి, పిల్లా జెల్లా అందర్నీ నిద్రపుచ్చి మేము బయలుదేరుతాం. వీధిలోకి వచ్చే మురుగుకాలవ బెజ్జాలు మాకు బయటి ప్రపంచంలోకి సింహద్వారాలు. అక్షణ్ణించి మొదలు మా ఉద్యోగం.

ఆ కాలవ చివరన అ కడ్డీలేమిటి తుప్పు పట్టి! ఈవాళో రేపోవూడి కింద బడేటు వున్నవి. అవి తీరా ఊడితేగాని కొత్తవి వేయించుకునేట్లులేరే. ఈపనికూడా మేమే చేసి వాళ్లచేత క్రొత్తవి వేయించాలి.

రామ రామ. అగది చూడండి. కిటికీ అయినా లేదుగదా. తలుపుకూడా వేసుకుని అందులో ఎలా పండుకుంటారబ్బా! గాలి





రావు సరిగబా, బైట యేదైనా దొంగతనం జరుగుతున్నా వినపడదే వాళ్ళకి! పోనీ తలుపులకి ఇనపకడ్డీలు వేయించుకో గూడమా. గాలికిగాలీ వస్తుంది, బైటఏదైనా గలభా జరిగితే తెలుస్తుందికూడాను. అబ్బే, చూస్తూ చూస్తూ యిలాంటివాటికి ఖర్చు పెడతారా ? అదేదో మనం పూనుకుంటేనే గాని వాళ్లకి శ్రద్ధకలగదు. ప్రస్తుతం, మనకు చేతనైనపని, చిన్న కిటికీలాంటి బొజ్జం ఏర్పాటుచేదాం. తర్వాత వాళ్లఇష్టం.

ఇక వంటిల్లు ఎలా తగలబెట్టారోగదా. అదీ ఇంతకన్న అర్ధాన్నంగానే వుంటుంది, సందేహంలేదు. అదుగో అనుకున్నంతా అయింది. అ పొయ్యి చూడండి, బొత్తికలు వూడి కాస్త బరువైన గిన్నె పెడితే కూలేలాగ వుంది. అంత నెత్తిమీదికి వచ్చేదాక వూరుకోకపోతే, యెప్పటికప్పుడు మెత్తుకుని సుఖంగా వుంచుకోరూ. ఎంత బద్ధకస్తులైనారు ఈకాలపువాళ్లు! పోనీ దానికేం డబ్బు ఖర్చా, పాడా? వీ ● తో దుమ్మూ దుమారం, పేడా లద్దే కలిపి అలికివుంచుకుంటే సరిపోతుందే. తీరా అది కూలిపడేదాకా అంతే వీళ్లు. అపని మనమేచేస్తే, రేపే ఈపాటికి లక్షణంగా యింకో పొయ్యి పెట్టుకోరూ!

ఇటుచూడు ఈమూల ఈ బియ్యముూట కిందపెట్టారు. ఎలుకా గిలుకా కొట్టేస్తయ్యే నైనా ఆలోచనలేదే. ఈ పప్పుడబ్బామీద మూత గట్టిగా పెట్టివుంచటానికికూడా ఒళ్లు బద్ధకమైతే ఎలా యేడుస్తాం? ఒకసారి అనుభవమైతేగాని జాగ్రత్తపడరు. ఆపనులు మనమేచేసి కాస్త ఒళ్లు దగ్గిరబెట్టుకుని సంసారం సాగించేట్లు చెయ్యాలి. ఎంత దాకని వూరుకో బుద్ధిపుడుతుంది చెప్పండి. వాళ్ళ యింట్లోవుంటూ, వాళ్ల మంచీ చెడూ మాకు కాకపోతే మరొకరికి పడుతుందా? మేము ఎన్నిసాన్లు సరిదిద్ది పెట్టిపోయినా మళ్లీ మామూలుచోట ఉంచనే వుంచరు.

ఇళ్ళు యిలా ఏడ్చినై, ఇక షాపులు చూద్దాము.

అదుగో ఆ బూట్లషాపు పరీక్షచేసి చాలా రోజులైంది. మళ్లీ చెత్తా చెదారం చేరే వుంటుంది. అదుగోచూడండి ఆమూల కుప్పలు కుప్పలుగా పాత చెప్పులతోపాటే పారేశాడు కొత్తచెప్పులుకూడాను. వేటికవి వేరేపెట్టుకోరూ? ఛా, ఛా! ఇదేమిటీ, ఈ చెప్పుకు యిక్కడ ఈ పీలికలేమిటీ. నాలుగురోజులు వాడితే దేనికది ఊడొచ్చేట్లుందే! తినేడబ్బు తింటూ మధ్య మళ్ళ ఈ అట్టముక్కలేమిటీ. ఎంతకీ ఈబుద్ధి మానడుగదా ఈ రామన్న. ఎప్పటికప్పుడు మేమువచ్చి యిలా దగాబాజీగా తయారుచేసిన జతల్ని, అట్టతీసేసి పోతూవున్నా, మళ్ళీ అవే వేసి కుడతాడేమంట.

మా ఈ దినచర్యగాక నిత్యజీవితంలో అనేకరకాల గమ్మత్తు అనుభవాలుకూడా జరుగుతుంటై. ఆ అనుభవాలు కేవలం గమ్మత్తేకాదు, చాలా ప్రమాదకరంగా





కూడా వుంటై. అయినా అన్నిటినించీ తప్పించుకొని వస్తూవుంటాము, మా బుద్ధి నంతా ఉపయోగించి.

ఒక రోజు ఏమి జరిగిందో తెలుసా? మేము, అంటే నేనూ, నాభార్యా అన్న మాట, బయలుదేరి మా ఉద్యోగాలకి పోతూపోతూ ఒక కాఫీ హెూటల్లోకి పోయాం. మీరూ వినేవుంటారు 'కాఫీ హెూటల్లో పనిచేసే మనిషికి, అక్కడి సైడు కాలవల్లో తిరుగుతుండే పందికొక్కుకీ చిక్కిపోటం అంటూ వుండదు'' అని.

మాకు కాఫీహెూటళ్లమీద అంతమోజు లేదుగాని తోటివాళ్ళు నిత్యం మెక్కుతుండటము చూస్తుంటే మాకూ ఆరోజు ఉండ బుద్ధిపుట్టలేదు. కాస్త మేముకూడా రుచిచూడా లనిపించింది. సరేగదా అని హెూటల్లోచేరాము. అప్పటికప్పుడే అంతా సొమ్మసిల్లి నిద్రపోతున్నారు. అంతా చీకటి గబ్బగయ్యంగా వుంది. కాని మేము మా పొడుగుపాటి మీసాల్తో దోవ అటుయిటు తడువుకుంటూ పోతాం గనక దారిలో ఏది అడ్డువున్నా మాకు వెంటనే తెలుస్తుంది.

అలా పోయిపోయి ఫలహారాలువుంచే అద్దాలబీరువా దగ్గిరికి చేరాం. బీరువాకి స్ప్రింగు తలుపులు వున్నై. నేను మెల్లిగా బీరువాలో పలికి పోయాను. నాభార్య బీరువా పైకెక్కి పహరా ఇస్తున్నది. అలా తిరగటంలో . ఆ బీరువామీదవున్న విస్తరాకులకట్ట కాస్తా దభేలున బీరువా తలుపు ముందువున్న పచ్చడిపళ్ళెంలో పడింది. హెూటలువాళ్లు లేచారు. ఇవాల్టితో నాకూ ఈ లోకానికీ సరి అని దిగులేసి యేమి చెయ్యటమా అని ఆలోచిస్తున్నా బీరువాలో.






హిమాలయ పర్వతాలలో ఒక పెద్దలోయ ఉన్నది. దానిచుట్టూ ఎత్తయిన కొండలున్నాయి. ఆ కొండలమీద వర్షం కురిసినప్పుడు వాటి శిఖరాలనుండి చాలా యేరులు పారుతాయి. కాని ఒక్కటీ లోయలోకి పారదు. అయినప్పటికీ ఏటా వానలు సమృద్ధిగా కురవటంవల్ల ఆ లోయలో గోధుమలూ, ద్రాక్షలూ, మేలుజాతి పళ్ళూ విరగ పండుతాయి. అందుకనే ఆ లోయకు 'బంగారులోయ' అనిపేరు.

ఆ లోయకు పడమటగా ఒక ఎత్తయిన పర్వత శిఖరం వున్నది. దానిమీదనుంచి ఒక నది అవతలివేపుకు ప్రవహిస్తుంది. సాయంకాలపు నీరెండలో అది బంగారంలాగా మెరుస్తుంది. అందుచేత అందరూ ఆ నదిని 'కాంచన గంగ' అని పిలుస్తారు.

ఈ బంగారు లోయ ముగ్గురన్నదమ్ములది. పెద్దవాడు సుందుడు, రెండోవాడుపేరు ఉపసుందుడు, మూడోవాడు నందుడు. అన్నలకన్న నందుడు చాలా చిన్నవాడు. పెద్దవాళ్ళిద్దరూ పరమ దుర్మార్గులు. వాళ్ళు తమవిషయంతప్ప మరేమీఆలోచించేవాళ్లు కారు. తమకిందపనిచేసే రైతులనూ, కూలీలనూ క్రూరంగా హింసించి, వారిరక్తం పిండేవారు. అందుచేత వారినందరూ రాక్షససోదరులని పిలిచేవాళ్లు. తమ తమ్ముడైన నందుణ్ణే వాళ్ళు ఎంతో హింసపెట్టేవాళ్లు.

నందుడు చాలా మంచివాడు. అమాయకుడు. అన్నలుపెట్టిన బాధలన్నీపడి వాళ్లకి అడ్డమైనచాకిరీ చేసేవాడు. వాళ్లకు వంట చేసిపెట్టటమూ, నీళ్ళుతోడటమూ, అంతా నందుడిపనే. ఎప్పుడైనా తిండిలేక వచ్చిన బీదవాడి కింత రొట్టెతుంపుపెడితే సుందోపసుందులు నందుణ్ణి కొట్టి, తిండిలేకుండా పడుకోబెట్టేవారు. వాళ్ళు అటువంటి పిసినిగొట్టువెధవలు. నందుడికి భూతదయ జాస్తిగానే వుండేది. కాని అన్నలకు భయపడి వాళ్లు ఇంటోలేనివేళ తలుపువేసుకుని పంటింటో కూర్చునేవాడు. అన్నలుతప్ప ఎవరు తలుపు తట్టినా తీసేవాడుకాడు.




"మంచి వానన కడుతున్నదే! రొట్టెలు కాలుస్తున్నావా? ఏదీ నాకొకటి పెట్టూ?" అంటూ ఆ పెద్దమనిషి లోపలికొచ్చాడు.

ఒకరోజు గాలివాన తీవ్రంగా ఉన్నది. సుందోప సుందులు బయటికి వెళ్ళారు. నందుడు వంటింటో అన్నలకోసరం రొట్టెలు చేస్తున్నాడు. ఇంతలో బయటి తలుపుమీద పెద్ద చప్పుడైంది. తన అన్నలు కూడా తలుపు అంత గట్టిగా తట్టరు.

నందుడు భయపడుతూ వెళ్ళి తలుపు తియ్యకుండానే, "ఎవరు?" అని అడిగాడు.



"తలుపుతియ్యి!" అని పెద్ద బొంగురు గొంతు మేఘంలాగా గర్జించింది.

నందుడు తలుపుతీశాడు. ఒక్కసారిగా ఇంటోకి తుపాను ప్రవేశించిన ట్టయింది. ఒక లావుపాటి పెద్దమనిషి లోపలికి వచ్చాడు. ఆయన వొంటిమీద గుడ్డ బుట్ట లాగా ఇంటికప్పుఎత్తు లేచింది. మనిషి నల్లగా మేఘంమాదిరిగా వున్నాడు.

"మంచివాసన కొడుతున్నదే! రొట్టెలు కాలుస్తున్నావా? ఏదీ నాకొకటి పెట్టూ!" అంటూ ఆ పెద్దమనిషి లోపలికి వచ్చాడు. ఆయన అడుగుపెట్టిన చోటనల్లా నీళ్ళు మడుగులు కడుతున్నాయి.

"అయ్యా, మీరెవరో నాకుతెలియదు. మిమ్మల్ని లోపలికి రానిచ్చినందుకు నన్ను మా అన్నలు చంపేస్తారు. వాళ్లు వచ్చేవేళ అయింది. మీరు దయచేసి వెళ్లిపొండి," అని బతిమాలాడు నందుడు.

ఆయన బిగ్గిరిగా నవ్వి, "నేనురాకుండా మీ అన్నలకెట్లా జరుగుతుందీ' ఏదీ, ఒక రొట్టె తినిపోతాను," అన్నాడు పెద్దమనిషి.

"స్వామీ నేను మీకు రొట్టెపెడితే అది నేనే తిన్నానని మా అన్నలు నన్ను చంపే స్తారు. సరిగా ముగ్గురికీ మూడు రొట్టెలే చేస్తున్నాను," అన్నాడు నందుడు.

"నేను మీకు ఎంత ఉపకారం చేస్తు న్నాను? నాకు ఒక్కరొట్టె పెడితే ఆరిగి పోతారా? అకలయి వచ్చినవాణ్ణి వెళ్ల గొట్టటం ధర్మమా?" అన్నాడా పెద్దమనిషి.

ఆయన చెప్పినమాట అబద్ధంకాదు. ఎందుచేతనంటే ఆయన వరుణదేవుడు. ఆయన వర్షించబట్టే ఆ లోయలో పంటలు సమృద్ధిగా ఉన్నాయి. ఆయన దయవల్లనే ఈ అన్నదమ్ములంత భాగ్యవంతులయి నారు. అయితే ఈ సంగతి నందుడికి తెలియదు. వాడికా పెద్దమనిషిని చూస్తే జాలివేసింది. వానకు తడిసి ఆకలిగొని ఉన్నవాడికి ఒక్క రొట్టె ఇస్తే ఇంతలో తరిగేదేమిటనుకున్నాడు. "అయ్యా, నావంతు రొట్టె తీసుకోండి," అన్నాడు నందుడు.

"మరి నీకో?" అన్నాడు వరుణదేవుడు.

"నాకులేకపోతే పర్వాలేదులెండి. పస్తు పడుకోవటం నాకు అలవాటే!" నందుడు.

వరుణదేవుడు నందుడిచ్చిన రొట్టె తింటూ, "చాలా బాగుంది! వరుణయ్య వచ్చి రొట్టె తినిపోయినాడని మీ అన్నలతో చెప్పు. వారు నిన్నేమీ అనరులే," అని వచ్చినదారేపట్టి వెళ్లిపోయాడు.

తరువాత కొద్దిసేపటికి సుందోప సుందులు తిరిగివచ్చారు. భోజనం పెట్ట మని అడిగారు. పళ్ళెంలో రెండే రొట్టెలు కనిపించాయి. మూడోది ఏదని అడిగారు. "ఎవరో వరుణయ్యట వచ్చి తినిపోయి నాడు. ఆమాట మీతో చెప్పమన్నాడు," అన్నాడు నందుడు భయపడుతూ.

"ఈ ఇంటో అడుగుపెట్టటానికి వరుణయ్యకేమధికారం ఉంది? అసలీ లోయలో కాలు పెట్టటానికి ఈ బిచ్చగాళ్లకే





మధికారముంది?" అన్నాడు సుందుడు ఇల్లెగిరేలాగ అరుస్తూ.

"వరుణయ్యాలేదు, వాగయ్యా లేదు! వెధవా! నువే రొట్టె తినేసి ఎవరిమీదో పెట్టి మా రొట్టెల్లో భాగంకోసం చూస్తున్నావు! అనుభవించు! నీ కీపూటకి తిండిలేదు. పో, వెళ్లి పడుకో!" అని ఉపసుందుడు తమ్ముణ్ణి కొట్టాడు.

కడుపులో మాడుతూ నందుడు వెళ్లి డొక్కలో కాళ్లుపెట్టుకు పడుకున్నాడు.

అంతే. ఆ లోయలో మరి వర్షంచుక్క పడనేలేదు.

వర్షాలూ పడక, వాగులూలేకపోతే ఏమవుతుందీ? బంగారు లోయ అని పేరు కెక్కిన ఆ లోయ యావత్తూ మరుసటి ఏడు బీడువేసిపోయింది. ఎక్కడి పళ్లచెట్లు అక్కడ మాడిపోయాయి. ద్రాక్షతోటలన్నీ ఎండిపోయాయి. ఆఖరుకు పచ్చగడ్డికూడా మాయమయింది.

మరోయేడు తిరిగింది. ఎక్కడచూసినా ఎర్రమట్టీ, ఇసుకా తయారయింది. లోయ చుట్టూతావున్న కొండలన్నీ బోడికొండ లయిపోయాయి.

సుందోప సుందులు ఇక ఏ రైతులను పీడిస్తారు? ఏమితింటారు? ఏమిడబ్బు కూడబెడతారు? దాచివుంచిన డబ్బంతా ఖర్చయిపోయింది. వెండి బంగారమంతా ఖర్చయిపోయింది. ఒక్క బంగారుపాత్ర మిగిలింది. దాన్నికూడా కరిగించి అమ్మటానికి సుందోప సుందులు సిద్ధమైనారు.

ఆ పాత్ర నందుడిది. దాన్ని కరిగించవద్దనీ, అది తనకువుండనిమ్మనీ నందుడు వేడుకున్నాడు. కాని సుందోప సుందులు వినలేదు. దాన్ని ఒక ఇనపబొచ్చెలోవేసి నిప్పుమీద పెట్టి వాళ్లిద్దరూ బయటి కెళ్లారు.

నందుడికి తన సర్వస్వమూ పోయినట్టనిపించింది. అతను విచారంగా కిటికీదగ్గిర నిలబడి, సాయంకాలపు నీరెండలో నిగనిగలాడే కాంచనగంగకేసి చూస్తూ, "అందులో ఉన్న నీరంతా బంగారం అయిపోగూడదూ?" అని అనుకున్నాడు.

"ఎందుకైపోవాలీ?" అని ఎవరో అన్నట్టు నందుడి చెవులకు వినిపించింది. నందుడు ఉలిక్కిపడి చుట్టూచూశాడు. పొయ్యిమీద ఇనపబొచ్చెతప్ప ఇంకేమీ కనిపించలేదు.

"వేడిగావుంది, నన్ను బయటవెయ్యి!" అన్నదొక కీచుగొంతు. ఆ గొంతు ఇనపబొచ్చెలోనుంచే వచ్చినట్టుగా తోచింది నందుడికి. అతను చప్పునవెళ్లి అందులోకి చూశాడు.

బంగారపుపాత్ర అంతా కరిగిపోయింది. కాని ఇనపబొచ్చెలో వున్న ద్రావకంలో తన ముఖానికి బదులు మరొకముఖం కనిపించింది. దానికి తెల్లటి మీసాలూ గడ్డమూ వున్నాయి. చిన్నచిన్న కళ్లున్నాయి.





"వేడిగావుంది, నన్ను బయటవెయ్యి!" అన్నదా ముఖం మళ్లీ నందుణ్ణిచూసి.

నందుడు ముందూ వెనకా ఆలోచించ కుండా ఆ బొచ్చె పైకితీసి దానిలో ద్రావ కాన్ని కిందికి పంచేశాడు. బంగారానికి బదులు ఒక మరుగుజ్జు ముసలాడు బయటికివచ్చి నందుడి మోకాలు ఎత్తున నిలబడ్డాడు. ఆ ముసలాడిజుట్టూ, వొళ్ళూ, చొక్కాకూడా బంగారు రంగులో నే వున్నాయి.

"అయ్యబాబోయ్!" అన్నాడు నందుడు.

"నన్నెరుగుదువా, నందుడూ? నేనే కాంచనగంగకు రాజును," అన్నాడు మరుగుజ్జు.

నందుడు తెల్లబోయి చూడసాగాడు.

"నీసంగతి అంతా చూస్తూనే వున్నాను. సుపుచాలా బుద్ధిమంతుడివి. అందుకని నీకోరహస్యం చెబుతావిను. ఆ కాంచన గంగమీదుగావున్న శిఖరం చూశావా! దాని మీదికి యెక్కి ఆ నదిలో ఎవరైతే మూడు బొట్లు పవిత్ర తీర్థం వేస్తారో వాడికి అనది బంగారం అవుతుంది. ఇతరులకది నీరు గానే వుంటుంది. మరోసంగతి - యెపడైనా ఆ నదిలో అపవిత్రమైన నీరు పోశాడా, వాడు కాస్తా నల్లరాయి యిపోతాడు. తెలి సిందా? జ్ఞాపకంవుంచుకో!" అంటూ ఆ మరుగుజ్జు, నందుడు జవాబుచెప్పేలోపుగా మంటల్లోకిదూకి మాయమైనాడు.

సుందోప సుందులు ఇంటికి తిరిగి వచ్చేసరికి బంగారుపాత్రలేదు. నందుడే దాన్ని దాచాడని వాణ్ణి ఇద్దరూకలిసి చచ్చేటట్టు కొట్టారు.

దెబ్బలుపడలేక నందుడు మరుగుజ్జునుగురించీ, అతనుచెప్పిన విషయాలూఅన్నలకుచెప్పేశాడు. సుందోప సుందులు మొదట వాడిమాటలు నమ్మలేదుగాని, ఎన్నికొట్టినా వాడు అదే చెప్పటంవల్ల నిజం కావచ్చు ననుకున్నారు.

నందుడు చెప్పినమాటల్లో వాళ్లకి ఎప్పుడైతే గురికుదిరిందో, వెంటనే కాంచన గంగను తనకోసం బంగారం చేసుకోవాలనే కోరికకూడా ఇద్దరికీ ఒక్కసారే కలిగింది. అది యెవరో ఒకరికే బంగారం అవుతుంది. అందుచేత సుందోప సుందులకు, "నువా, నేనా?" అని తగూవచ్చింది. ఇద్దరూ కాట్లకుక్కల్లాగా పోట్లాడుకున్నారు. బలంగలవాడు కనక అన్న అయిన సుందుడే గెలిచాడు.

అయితే సుందుడికి పవిత్రతీర్థం యెవరిస్తారు? ఏ అర్చకుణ్ణిఅయినా అడగాలి. అర్చకుడు సుందుడివంటి నరరాక్షసుడికి పవిత్రతీర్థం ఇవ్వసన్నాడు. ఇదికాదు ఉపాయమని సుందుడు అర్చకుడిదగిర వున్న పవిత్రతీర్థం కాస్తా దొంగిలించి ఒక సీసాలో పోసుకున్నాడు. ఒక తట్టనిండా తిండీ, సారాయీ పెట్టుకున్నాడు. కాంచన గంగ శిఖరం ఎక్కటానికి ప్రయాణమైనాడు.



సుందుడు గబగబా కొండయెక్క సాగాడు. కొంతదూరం వెళ్లేసరికి మంచు తగిలింది. ఆ మంచు అతనెన్నడూ చూడలేదు. మంచుమీద కాలుజారుతున్నది. ఏమాత్రం అజాగ్రత్తగావున్నా కిందపడి చచ్చిపోయేటట్టుగా వున్నది. దారిపక్క అగాధం. ఆ కంగారులో అతని భుజంమీద వున్న భోజనంతట కాస్తా పడిపోయింది. చేతిలో పవిత్రోదకం సీసామాత్రం వుంది.

ఒకగంట యెక్కేసరికలా అతనికి అమిత దాహమయింది. సీసాలో చాలా నీరున్నది. కావలిసింది మూడుబొట్లేగదా అనుకుని గొంతు తడిచేసుకోవటానికి సీసా యెత్తాడు. ఇంతలో దాహానికి చచ్చిపోతూన్న ఒక కుక్క కనిపించింది. అది



నాలుక బయటికి పెట్టి ఆతనికేసి దీనంగా చూసింది. సుందుడు దాన్ని ఒక్కతన్ను తన్ని కాస్త నీరుతాగి ముందుకు సాగాడు.

సుందుడు మరో గంటసేపు కొండ యెక్కాడు. కొండ, వేడికి ఆవిర్లు తేలుతున్నది. కాళ్ళు మాడుతున్నాయి. మళ్లీ దాహమయింది. ఆదివరకే సీసా సహం ఖాళీ అయిపోయింది. మిగిలినదాన్లో సహం తాగుదామనుకున్నాడు. ఆ కాలే రాళ్లమీద అతనికొక పసిపాప కనిపించింది. ఆ పాప దాహంతో చచ్చిపోతున్నది. కాని సుందుడు ఆ పసిపాపవంక చూడనైన చూడకుండా తనదాహంమాత్రం తీర్చుకుని ముందుకు సాగిపోయినాడు.

కొండ అంతకంతకూ నిలువెక్కి ఎక్కరాకుండా వున్నది. కాని శిఖరం చాలా



సమీపంలోకి వచ్చింది. అడుగడుక్కూ సేదదీర్చుకుంటూ సుందుడు ముందుకు సాగాడు. ఇంతలో దారికడ్డంగా ఒక ముసలాడు కనిపించాడు. వాడు చచ్చిపోతున్నట్టు కనపడ్డాడు.

"దాహం! దాహం," అని గొణిగాడు ముసలాడు.

"నువ్వింక బతికి ఉద్ధరించేదేమిటి?" అంటూ సుందుడు వాడిమీదిగా దాటుకుంటూ పైకివెళ్లాడు. ఆకాశమంతా అంధకారమయింది. భయంకరమైన ఉరుము వినిపించింది. సుందుడి కాళ్లకింది అగాధంలోకి కాంచనగంగ ఉరుకుతోంది, చేతిలోవున్న సీసావిసిరి ఆ జలపాతంలో పారేశాడు. మరుక్షణం అతని శరీరం బిగుసుకుపోయి, స్పృహతప్పింది. అతను నల్లరాయి అయిపోయి నదిలోకి దొర్లిపడ్డాడు.

ఇంటిదగ్గిరవున్న నందుడు తన పెద్దన్న అయిన సుందుడు తిరిగిరానందుకు చాలా దుఃఖించాడు. కాని ఉపసుందుడు చంకలు కొట్టుకున్నాడు. పవిత్ర తీర్థం దొంగిలించటంవల్ల తన అన్న బండరాయి అయిపోయివుంటాడని ఊహించి, ఉపసుందుడు నందుడు దాచుకున్న డబ్బులు లాక్కుని, ఆవిపెట్టి ఒక దగా అర్చకుడిదగ్గిర పవిత్ర తీర్థం కొనుక్కుని, తట్టలో తిండిపెట్టుకుని కొండ యెక్కటానికి బయలుదేరాడు.

ఉపసుందుడుకూడా అన్నలాగే చాలా కష్టపడుతూ కొండ యెక్కసాగాడు. కొంత



దూరంపోయినాక అతనికొకపాపకనిపించి దాహమన్నది. అతను పాపకు దాహ మివ్వక తానే తాగి ముందుకుసాగాడు.

మరికొంతదూరంపోయినాక ఒకముస లాడుయెదురై దాహమన్నాడు. కాని ఉప సుందుడుఇవ్వలేదు.ముందుకుసాగాడు.

ఇంకా కొంతదూరం పోయాక దారి కడ్డంగా సుందుడుకనిపించి, "దాహం! దాహం!" అన్నాడు.

"ఓహో! నీకోసం నీరుతెచ్చా నను కున్నావా?" అంటూ ఉపసుందుడు అన్న మీదుగాదాటి కొండ యెక్కాడు.

అఖరుకు ఉపసుందుడి కాళ్ళకింద కాంచనగంగ జలపాతం కనిపించింది. తన చేతిలోవున్న నీటి సీసా అందులో విసిరివేసి తానుకూడా నల్లరాయి అయి పోయి అందులోకి ఒరిగిపోయాడు.

అన్నలిద్దరూ తిరిగి రాకపోవటంచూసి నందుడు బయలుదేరాడు. అతనికొక అర్చకుడు పవిత్రతీర్థం అడగగానే ఇచ్చాడు. అన్నల్లాగే అతనుకూడా తిండి తట్టలోపెట్టుకుని కొండ యెక్కటానికి బయలుదేరాడు.

పసివాడు కావటంచేత దారి అతనికి మరింత కష్టమనిపించింది. తిండితట్ట యెప్పుడోపోయింది. దాహం బాధించ సాగింది. చేతిలోవున్న పవిత్రతీర్థం తాగుదా మనుకుంటుండగా ఒక ముసలాడు కని పించి, "దాహం, దాహం!" అన్నాడు.



చేతిలోవున్న సీసా ముసలాడికిస్తూ, "దయచేసి అంతా తాగెయ్యకండి," అన్నాడు నందుడు.

కాని ముసలాడు సీసాలో చాలాభాగం తాగేసి కొద్దిగా మిగిల్చాడు.

నందుడు తాను తాగటం మానేసి ముందుకుసాగాడు. అతనికి దారి వెనక టంత కష్టంగా తోచలేదు. రాళ్ళమీద పచ్చ గడ్డి కనిపించింది.

ఒకగంట వెళ్ళేసరికి నందుడికి మళ్లీ దాహమయింది. సీసాఎత్తి తాగబోయాడు. కాని ఇంతలో దారికడ్డంగా ఒక పాప కని పించింది. దాహమని యేడుస్తోంది. తన దాహం మరికొంతసేపు భరించటానికి నిశ్చ



యించుకుని నందుడు పాపనోటికి సీసా అందించాడు. పాప సీసా దాదాపు ఖాళీచేసి కొండదిగి పరిగెత్తసాగింది.

నందుడు మరో గంటసేపు నడిచాడు. కొండయావత్తూ మంచి పూలవాసనలు వెదజల్లుతున్నది. మళ్లీ నందుడికి దాహ మయింది. సీసాలో అయిదారుచుక్కల నీరే వుంది. అందుచేత అతనికి తాగటానికి మనసొప్పక సీసా దించాడు. కాని ఆదే సమయంలో దాహనికి చచ్చిపోతూ ఒక కుక్క కనిపించింది. "వెధవబంగారం లేకపోతే పోయె!" అనుకుని నందుడు చావటానికి సిద్ధంగావున్న అకుక్క నాలుక మీద తన సీసాలోవున్న పవిత్రోదకం పో సేశాడు. కుక్కలేచి తోకాడించుకుంటూ కొండదిగిపోయింది.

శిఖరం చేరువలోనే వుందికాని అతని దగ్గిర పవిత్రోదకంలేదు. అయితే నందుడికి తన కళ్ళసమీపంలో ఒక మెట్టకలువ కని పించింది. దాని రేకులమీద మూడు మంచుబిందువులు కనిపించాయి.

నందుడు ఆ పువ్వుకోసి దాని మీది మంచు బిందువులు కాంచనగంగలోకి విదిలించాడు.

అతను తిరిగి ఇంటికి వచ్చేసరికి కాంచనగంగ ఒక పాయచీలి బంగారు లోయగుండా ప్రవహిస్తున్నది. ఈ నదిలో ఎండిపోయిన లోయ అంతా తడిసింది. మళ్లీ గడ్డిమొలిచింది. తోటలు వెలిశాయి. పొలాలు పండాయి. బంగారులోయ తిరిగి నిజంగా బంగారులోయ అయింది.

నందుడు ఆ సంపద యావత్తూ అనుభ వించాడు. అడిగినవాడికి పెట్టి, రైతులనూ, కూలీలనూ దయతోచూసి నందుడు, తన అన్నలు సంపాదించిన అపఖ్యాతి పోగొట్టు కుని మంచిపేరు తెచ్చుకున్నాడు.





# అత్తా కోడళ్ల కథలు

అనగా అనగా ఓవూళ్లో ఓ బ్రాహ్మ డున్నాడు అతని కో భార్య ఉంది. తల్లి కూడా ఇంట్లోనే ఉంది. పెత్తనం అంతా తల్లిదే అత్తగారు కోడల్ని నానా బాధలు పెట్టేది. కడుపునిండా అన్నమేనా పెట్టేది కాదు. వాళ్ళ దొడ్లో ఓ కాకర పాదుంది. అత్తగారు అప్పుడప్పుడు ఆ కాయలు కోసు కొని వండుకుని తినేది. కోడలుకు ఒక్క కూర ముక్క కూడా పెట్టేది కాదు. కూర తినాలని కోడలికి కోరికగా ఉండేది. కాని ఏంజేస్తుంది?

ఓ రోజున అత్తగారు తన కూతుర్ని చూద్దామని ఆ ప్రక్క వూరు వెళ్లింది. అదే సమయమని కోడలు కాకర కాయలు కోసుకుని చక్కగా కూర వండుకుని అన్నం తినబోతూంది. ఇంతలో అత్త వచ్చి తలుపుతట్టింది. గట్టి చిక్కు వచ్చింది కోడలికి. అపండిన అన్నం కూర మంచి నీళ్లబిందెలో పెట్టుకుని అత్తగారికి తలుపు తీసి, తాను నీళ్లుతెచ్చే నెపంతో బయటికి వెళ్లింది కోడలు.

ఆ నూతిదగ్గరమాత్రం ఆమెకు వీలు చిక్కుతుందా? ఊళ్లోవాళ్లంతా నీళ్ళకు వచ్చారు. అక్కడ తిండానికి వీలులేక మరికొంచెందూరంలో ఉన్న అమ్మవారి గుడిలోదూరి ఎవరేనా వస్తారేమో అన్న అదుర్దాతో పెద్దపెద్దముద్దలుచేసి తినడం ప్రారంభించింది. అలా తినడం అమ్మ వారికే ఆశ్చర్యంవేసి ముక్కుమీద వేలు వేసుకుంది అమ్మవారు ఆ అన్నంకూర అనగానే కోడలులేచి బావికివచ్చి నీళ్ళు తీసుకుని ఇంటికి వెళ్లిపోయింది.

ఆసాయంత్రం గుడిపూజారి గుడికి వచ్చి అమ్మవారి ముక్కుమీద వేలు చూచి ఆశ్చర్యపోయాడు. అగలు పొగలు గ్రక్కుతూపోయి రాజుగారితో ఈ సంగతి చెప్పాడు. రాజు పురోహితుల్ని పిలిపించాడు. ఇది గ్రామానికి అరిష్టం అన్నారు పురోహితులు. ఆవేలు తీయించినవారికి వెయ్యినూట పదహార్లు ఇస్తామని చాటించాడు రాజుగారు. ఎంతమందో ప్రయత్నించారు. కాని అమ్మవారు వేలు తియ్యలేదు.

నే తీయిస్తానని బయల్దేరింది కోడలు. మళ్లీ తనబిందె తీసుకుని తిన్నగా గుడిలోకి వెళ్లి తలుపులేసి బిందె పైకిఎత్తి దేవతతో

ద్విభాష్యం సూర్యనారాయణమూర్తి, దుర్గాడ.



'మొగుడిచాటు పెళ్లాలుంటారు. అత్తచాటు కోడళ్ళుంటారు. లోకమాతవు, ఈ మాత్రం జ్ఞానమన్నా ఉండొద్దా నీకు! వేలు తీస్తావా, బిందె మొహాన వెయ్యమంటావా?' అంది. అమ్మవారు బెదిరిపోయి వేలు తీసేసింది.

ఈవిడశక్తికి ఊరివారంతా ఆశ్చర్యపోయారు. రాజుగారు అన్నమాటప్రకారం ఆవిడకు వెయ్యినూటపదహార్లు, పండ్లు, పసుపు, కుంకుమ, చీరలు ఇచ్చారు. అత్తగారి మొహం మొండిచేటంత ఐంది. ఐనా కోడలి సంపాదనకు మెచ్చుకొంది. కొంచెం గౌరవంగా చూడడం మొదలు పెట్టింది. అవూళ్లోవాళ్ళు, 'అమ్మవారిని బెదరగొట్టిన ఇల్లాలు, కాబట్టి అవిడకంటే ఈవిడే గొప్ప' అనుకున్నారు. అక్కడనుంచీ మొక్కుబడులన్నీ ఈవిడకే ఇవ్వ మొదలుపెట్టారు. పళ్ళు, ఫలహారాలు, కోళ్ళు, గొర్రెలతో నిండి పోతూంది ఇల్లు. అత్తగారికి సంతోషంతోపాటు అసూయా భయమూ బయల్దేరాయి.

ఓరోజున కొడుకుని రహస్యంగా పిల్చి 'ఒరే అబ్బాయి! నీ పెళ్ళాం సామాన్యం అయిందికాదు నాయనా! ఇదేదో అమ్మవారు. నిన్నూ నన్నూ కూడా మింగేస్తుంది కొద్దిరోజుల్లో. ఈ పీడ వదుల్చుకుని నువ్వు మళ్ళీ పెళ్ళాడరా బాబు' అంది.

'ఎలాగ వదుల్తుందే పీడ?' అన్నాడు కొడుకు. ఒక ఉపాయం చెప్పింది తల్లి. సరే అనుకున్నారు ఇద్దరూను. ఆరాత్రి భోజనాలయాక బలవంతంగా కోడలు నోట్లో గిద్దకొట్టి ఓ చాపలో చుట్టబెట్టి కట్టి వేసి తల్లీ కొడుకు లిద్దరూ సాయంబట్టి స్మశానానికి మోసుకుపోయారు. అక్కడ కాష్టంపేర్చారు. ఇంతట్లో 'నాయనా! అగ్గి పెట్టె తెచ్చావా?' అంది తల్లి. 'లేదు'



అన్నాడు కొడకు. 'నువ్వ ఇక్కడ ఉండు. నే తెస్తాను' అంది తల్లి. 'అమ్మ బాబో! నేనుండలేను' అన్నాడు కొడుకు. 'నేనూ ఉండలేను' అంది తల్లి. ఇద్దరూ వెళ్లి తేవడానికే నిశ్చయించుకున్నారు. ఆ చాపచుట్ట అక్కడపెట్టి ఇద్దరూ ఇంటికివెళ్ళిపోయారు. ఈలోగా కోడలు కట్లు వదులుచేసికొని మెల్లగా బయటకువచ్చి, అప్రక్క నేవున్న ఒక ఈతబొంద ఆ చాపలో కట్టేసి ఓ చెట్టెక్కి కూర్చుంది. తల్లీ కొడుకూ వచ్చారు. చాపచుట్ట సాయంబట్టి కాష్టంమీదపెట్టి నిప్పంటించి, 'ఇక వదిలింది పీడ!' అనుకుని ఇంటికి వెళ్ళారు.



ఆ రాత్రి అవూరు రాజుగారి ఇంట్లో దొంగలుపడి నగలు, ధనము దోచుకొని ఊరిబయట స్మశానందగ్గర చెట్టుక్రింద కూర్చుని లెక్కపెట్టుకుంటున్నారు. ఆ చెట్టుమీదఉన్న కోడలు కునికిపాట్లు పడుతూ జారి ఢభేలున కిందపడింది. ఆ పడ్డంలో నోటిలో గిద్ద ఊడింది. దొంగలు ఈవిడనుచుచి అమ్మవారికి పై అమ్మవారని తెలుసుకొని సాష్టాంగనమస్కారాలు చేసి ఆ తెచ్చిన ధనం, నగలు ఆవిడకు సమర్పించి చక్కాపోయారు. ఆ నగలు, ధనము తీసికొని తెల్లవారేసరికల్లా ఆమె మళ్లీ ఇంటికివెళ్లి తలుపుతట్టింది. హడలిపోయారు తల్లీ కొడుకులు. ఇద్దరూ అతి భయంతో తలుపుతీశారు. కోడల్ని చూచి బ్రహ్మరాక్షసేనని నిశ్చయించుకుని వెల్లకితలా పడిపోయారు. కొంతసేపటికి లేచాక, తాను బ్రహ్మరాక్షసిని కాదనీ, నిజంగా కోడల్నేననీ చెప్పింది. తాను స్వర్గలోకం వెళ్ళాననీ. అక్కడ మామగారు కనబడ్డారనీ, ఈనగలు, ప్రాణాలు ఇచ్చారనీ చెప్పి నమ్మకం కలిగేట్టుగా అన్నీ చూపించింది. నిజమే అని నమ్మింది

అత్త. 'ఇంకా ఏమైనా చెప్పారా మామయ్య' అని అడిగింది. 'మీ అత్తనుచూచి చాలా రోజులయింది. ఓ మారు చూడాలని ఉంది. నీవు వెంటనేవెళ్లి మీ అత్తను పంపించు. ఈనగలు అవీ ఇయ్యి. ఇక్కడ నాకేం లోటులేదు. కావలసినంత భోగం' అన్నారు. వెళ్లినా సరే! మానినాసరే" అంది కోడలు.

'అయ్యో! ఎంత అదృష్టవంతురాలవే నువ్వు! మామగార్ని చూడగలిగావు. నాకు మాత్రం చూడాలనిలేదుటే తల్లీ! ఎన్నాళ్లయిందో చూచి, ఇంతకంటేంగావాలే' అని ఉవ్విళ్లూరిందిఅత్త. తననుకూడా అరాత్రి చాపలోచుట్టి దహనం చెయ్యమని కొడుకును కోడల్ని బ్రతిమాలింది. మళ్లీ త్వరగానే వచ్చేస్తానని వాగ్దానంచేసింది. సరే అన్నారు కొడుకూ, కోడలూను. అరాత్రి అవిడను చాపలోచుట్టి స్మశానంలోనికి తీసికొనివెళ్లి చక్కగా నిప్పు అంటించారు. తెల్లవారింది. అమ్మ రాలేదు. 'ఏమే! మా అమ్మ రాలేదేం?' అన్నాడు భర్త.

'వస్తారు తొందరపడతారేం?' అన్నది భార్య.

అలాగ మూడురోజులు గడిచాయి. అమ్మరాలేదు. 'ఏమే! అమ్మ రాలేదేమంటావు?' అన్నాడు. 'అయ్యో! చాలా రోజులకువెళ్ళారు. కష్టసుఖాలు చెప్పుకోవాలా మరి? అప్పుడే వదుల్తారా మీ నాన్నగారు. వస్తారు ఏనెలకో' అంది భార్య.

నెల గడిచింది. అమ్మరాలేదు. రెండు నెలలు గడిచాయి. అమ్మరాలేదు. సావకాశంగాకూర్చోబెట్టి జరిగినదంతా చెప్పింది భార్య. తనభార్య పడ్డబాధలకు విచారించాడు భర్త. అమ్మ ఇంకరాదని తెలుసుకున్నాడు. అమ్మకోసం అప్పుడప్పుడు ఏడ్చినా భార్యకు బాధ తప్పిందని సంతోషిస్తూ హాయిగా ఉన్నాడు. దంపతులిద్దరూ చాలా కాలం హాయిగా గడిపారు.

అలాటి అత్తగారి బాధ యుక్తిగా తప్పించుకుందని విన్నవాళ్లంతా సంతోషించారు. మరి మీరో?






ఒక వూళ్లో ఒక పిల్లి ఉండేది. ఆ పిల్లికి చిలకతో స్నేహమయింది. ఒకనాడు పిల్లి తన స్నేహితుడైన చిలకను విందుకు పిలిచింది. కాని వొట్టి పిసినిగొట్టు కావటం చేత చిలకకు మంచి విందుచెయ్యక కొద్దిగా పాలూ, కాసిని బరానీగింజలూ మాత్రమే పెట్టింది. చిలక చాలా మర్యాద గలది. అందుచేత పైకేమీ అనలేదు.

మర్నాడు విందుచేయటం చిలకవంతు. చిలక ఈ విందుకు అట్టహాసంగా ప్రయత్నాలుచేసింది. అయిదువందల లడ్లూ, ఐదుతట్టల అన్నమూ, ఐమ కాగుల పాయసమూ చేసి పిల్లిని విందకుపిలిచింది.

భోజన పదార్థాలు చూడగానే పిల్లికి ఎక్కడలేని సంతోషమూ వచ్చింది. చిలక రెండు లడ్డుండలు మాత్రం తనకోసం ఉంచుకుని మిగిలిన వంటకాలన్నీ పిల్లి ముందు పెట్టేసింది. పిల్లి రెండుచేతులా మెక్కసాగింది. ఒక్కొక్క లడ్డుండే లటుక్కున నోట్లోవేసుకుని గుటుక్కున మింగసాగింది. అన్ని లడ్డుండలూ అయిపోయాయి. అన్నమంతా అయిపోయింది. కూర లయిపోయాయి. పాయసం అయిపోయింది.

"నా కాకలిగా ఉంది, ఇంకేమున్నది?" అన్నది పిల్లి.

తనకోసం దాచి ఉంచుకున్న రెండు లడ్డుండలూ తెచ్చి పిల్లి పళ్లెంలో పెట్టి, "ఇంతే, ఇంకేమీ లేవు" అన్నది చిలక.

పిల్లి రెండు లడ్డుండలూ రెండు చేతులా లటుక్కున నోట్లోవేసుకుని గుటుక్కున మింగేసి, "ఇంకేముంది?" అన్నది.

చిలకకు కోపంవచ్చింది. "ఉన్నదంతా నీకే మింగపెట్టాను. ఇంకేముంది? కావలిస్తే నన్ను మింగు" అన్నది.



పిల్లి ముసలమ్మను పట్టుకుని లటుక్కున నోట్లోవేసుకుని గుటుక్కున మింగింది.

సరదాగా వీధివెంబడి కొంతదూరం పోగాపోగా పిల్లికి, గాడిదను తోలుకు-టూ ఒక చాకలి ఎదురువచ్చాడు.

"ఏయ్, పిల్లీ! నీకు కళ్లులేవా? గాడిద కాళ్లకిందపడి చస్తావా ఏం? తొలుగు! తొలుగు!" అన్నాడు చాకలి.

"ఓరబ్బా! నీకెంత పొగరురా! నేనంటే ఎవరనుకున్నావు? ఐదువందల ఉడ్డుండలు ఫలహారం చేశాను; ఐదు తట్టల అన్నం భోంచేశాను; ఐదు కాగుల పాయసం

అన్నదేచాలుగదా అని పిల్లి చిలకను పట్టుకుని లటుక్కున నోట్లోవేసుకుని గుటుక్కున మింగింది.

అక్కడినుంచి బయలుదేరి పిల్లి వీధిలోకి వచ్చింది. వీధిలోఉన్న ఒక ముసలమ్మ పిల్లిచేసిన పాపిష్టిపని కళ్లారా చూచింది. ఆ ముసలమ్మ పిల్లిని నిలవేసి, "నీకేం పోయ్యేకాలమే, పిల్లీ? నీ స్నేహితుడైన చిలకనుమింగుతావా?" అన్నది.

"నువ్వు నాకు చెప్పేదానివా ముసలమ్మా? చూడు నిన్నేంచేస్తానో," అంటూ





తాగాను; నాస్నేహితుడు చిలకను భక్షించాను; అడ్డు చెప్పిన ముసలమ్మను మింగాను; ఇక నువ్వూ నీగాడిదా ఒక లెఖ్ఖా" అని పిల్లి చాకలినీ, గాడిదనూ కూడా లటుక్కున నోట్లోవేసుకుని గుటుక్కున మింగి ముందుకు సాగింది.



పోగా పోగా పిల్లికి ఒక ఊరేగింపు ఎదురయింది. కొత్తగా పెళ్లిఅయిన రాజుగారూ రాణీగారూ ఊరేగుతున్నారు. బోలెడన్ని మేళాలు వాయిస్తున్నారు. బోలెడంత పరివారం నడుస్తున్నది. వెనక వంద



ఏనుగులు నడుస్తున్నాయి. పిల్లి ఈ ఊరేగింపుకు ఎదురుగా వెళ్లింది.

"ఏయ్, పిల్లీ! కళ్లులేవా? ఏనుగుల కాళ్లకింద పడి చస్తావా? తొలుగు, తొలుగు!" అన్నాడు రాజుగారు.

"తొలగాలిగా! నేనంటే ఎవరనుకున్నావు? ఐదువందల లడ్డుండలు ఫలహారం చేశాను; ఐదుతట్టల అన్నం భోంచేశాను; ఐదు కాగుల పాయసం తాగాను; నాస్నేహితుడు చిలకను భక్షించాను; అడ్డుచెప్పిన ముసలమ్మను

మింగాను; దేవతొలగమన్న చాకలినీ వాడిగాడిదనూ గుటుక్కు మనిపించాను; ఇక నీవూ నీ పరివారమూ ఒక లెఖ్ఖా?" అంటూ పిల్లి రాజునూ, రాణీనీ, పరివారాన్నీ, మేళగాళ్లనూ, ఏనుగులనూ లటుక్కున నోట్లో వేసుకుని గుటుక్కున మింగేసింది.

ఇప్పటికి పిల్లి ఆకలి పూర్తిగా తీరింది. కాని పిల్లికి ఒక్క అసంతృప్తి ఉండి పోయింది. ఇన్నితిన్నా ఒక్క ఎలుకను తిననిలోటు దానికి ఉండనేఉంది.

పిల్లి ఈమాట అనుకుంటుండగానే ఒక ఎలుక దాని దారికి ఎదురుగా నిలబడి, "ఏయ్, పిల్లీ! తొలుగు, తొలుగు!" అన్నది. పిల్లికి పరమానంద మయింది. వెదకబోయినతీగె కాళ్లకు చుట్టుకున్నట్టు పిల్లికి ఎలుకే దొరికింది. ఉత్సాహంతో పిల్లి ఎలుకను అవలీలగా ఎత్తి లటుక్కున నోట్లో వేసుకుని గుటుక్కున మింగింది.

పిల్లిపొట్టలో అంతా చీకటిగా ఉంది. కాని ఎలుక గనక చీకట్లోకూడా లడ్డుండలనూ, చిలకనూ, ముసలమ్మనూ, చాకలివాణ్ణి, గాడిదనూ, రాజుగార్నీ, రాణీగార్నీ, పరివారాన్నీ, మేళాలనూ, ఏనుగులనూ, పోల్చుకోగలిగింది. ఇవన్నీ చేరినందువల్ల పిల్లిపొట్ట తగని ఇరుకుగా ఉంది. అందు చేత ఎలుకకు అక్కడ ఉండ బుద్ధి పుట్ట లేదు. తన వాడిపళ్లతో ఎలుక పిల్లిపొట్ట కొరికి పెద్దబొక్క పెట్టి బయటికొచ్చింది. దాని వెంటనే తనకు కావలిసిన రెండు లడ్డుండలూ పట్టుకుని చిలుక బయటికి వచ్చేసింది. చిలుక వెనకటితే ముసలమ్మా, చాకలివాడూ, గాడిదా, రాజూ, రాణీ, పరివారమూ, మేళాలూ, ఏనుగులూ అన్నీ బయటికి వచ్చేశాయి.

పాపం, పిల్లి ఏంచేస్తుంది? పొట్ట కుట్టించుకోవటానికి మాదిగాడి దగ్గిరికి పోయింది.






అనగా అనగా ఓ అబ్బాయి. ఆ అబ్బాయికి శుభ్రంగాఉండటం చాతే కాదు. వొంటినిండా మురికీ, చొక్కా నిండా సీరా మరకలూ, కళ్లకు పుసులూనూ. ఎంత మంచి గుడ్డలువేసుకున్నా క్షణంలో తోళ్లయేవి. సరిగా మొహం కడుక్కోడు. వీళ్ళు అసలే పోసుకోడు.

ఒకరోజు వాడిగదిలోకి ఒక దేవత వచ్చింది.

"చూడు నీ గది ఎట్లాఉందో. నేల నిండా దుమ్ము. ఎక్కడ చూచినా పుస్తకాలే. పక్కబట్టనిండా కాళ్లతో తొక్కిన బురద. ఛీ, ఛీ! నీ గది బాగుచెయ్యాలి. నువు కాస్సేపు బయటికి వెళ్లి నీఅన్నతోఆడుకో!"అన్నదిదేవత.

"నాకు అన్నలేదు," అన్నాడు అబ్బాయి.

"లేకేం? ఉన్నాడు. నీకింకా తెలీదు గామాలు. నీకు వాడు తెలియకపోయినా, వాడికి నువు తెలుసులే. బయటికిపోయి దొడ్డి వాకిట్లో నిలబడు. వాడే కనిపిస్తాడు," అన్నది దేవత.

"అన్నీ అబద్ధాలే,"అంటూ అబ్బాయి దొడ్లోకివెళ్ళి వాకిట్లో నిలబడ్డాడు.

కాసేపట్లో ప్రక్కనున్న చెట్లమీదినుంచి ఒక ఉడత అబ్బాయిపక్కగా వచ్చింది.

"ఉడతా, ఉడతా! నువేనా మా అన్నవు?" అన్నాడు అబ్బాయి.

"ఇంకా నయం! నేను చూడు ఎంత శుభ్రంగా ఉన్నానో. నా గూడు చూడు. నా పిల్లలుచూడు! మేము నీమాదిరిగా మురికి సహించం," అని ఉడత చంగున ఎగిరిపోయింది.

మరి కాస్సేపటికి గెంతుకుంటూ ఒక గోరింక వచ్చింది.





"గోరింకా, గోరింకా, నువేనా మా అన్నవు?" అన్నాడు అబ్బాయి.

"నాకేం ఖర్మంకాలింది, నాయనా! నేనుచూడు నిక్షేపంలాగున్నాను. నా వొంటిమీద ఎక్కడన్నా ఒక్క నెరసు మట్టి చూపగలవూ?" అంటూ కోపంగా ఎగిరిపోయింది గోరింక.

ఇంకాస్సేపటికి అక్కడికి ఒక పిల్లి వచ్చింది. "పిల్లీ, పిల్లీ! నువేనా మా అన్నవు?" అన్నాడు అబ్బాయి.

"చాల్లే! మంచి మాటడిగావు! ఉదయంలేచి ఇప్పటికి ఆరుసార్లు వొళ్లంతా శుభ్రంచేసుకున్నాను. నువు నా తమ్ముడివంటే ఎవరైనా నవ్విపోతారు," అంటూ పిల్లి తోక ఆడించుకుంటూ తనదారిన పోయింది.

ఆతరవాత దొడ్డివాకిలి ముందుగా ఒక పందిపోతూఉంది. దానివొంటినిండా చేతిమందాన బురద అట్టకట్టి ఉన్నది.

అబ్బాయికి పందిని పలకరించ బుద్ధి కాలేదు. దాన్నిచూస్తే అసహ్యంవేసింది.

అబ్బాయి పలకరించక పోయినా పందే, ఆగి "ఏం, తమ్ముడూ!" అని అబ్బాయిని పలకరించింది.





"నేను సీతమ్మణ్ణికాను ఫో!" అన్నాడు అబ్బాయి.

"కాకేం? అచ్చగా నువే నాతమ్ముడివి. మనకు పోలికలు తెలియటంలేదా? ఆగోడకింద చక్కని బురదఉంది పోయి పొర్లాడుదాం, రా!" అన్నదిపంది.

"ఛీ, ఛీ! నేను బురదలో పొర్లాడను," అన్నాడు అబ్బాయి.

"ఎవరికి చెబుతావు? చూసేవాళ్ళకి కళ్ళు లేవనుకున్నావా? నాతో వచ్చావంటే నాకు పోసేకుడితిలో నీకున్నూడా భాగం ఇస్తాను," అన్నది పంది.





"నాకు కుడితివద్దు," అంటూ అబ్బాయి ఏడవసాగాడు.

ఇంతలో దేవత బయటికివచ్చి, "నీ గదంతా చక్కగా చేసిపెట్టాను. దాన్ని పాడుచేశావంటే జాగర్త! ఇంతకూ నువు మీ పందిఅన్నవెంట పోతావా, నావెంట లోపలికి వస్తావా?" అని అడిగింది.

"నీవెంటే, నీవెంటే వస్తున్నాను!" అంటూ అబ్బాయి దేవత చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు.

"వెళ్లు! కుడితి నాకే ఆదా!" అని గోంక్రిస్తూ పంది వెళ్ళిపోయింది.




# రాజుగారి ముస్తాబు

## పాత్రలు

| | |
|---|---|
| రాజు | ఇద్దరు సీమసాలీలు |
| మహామంత్రి | చోపుదార్లు |
| అష్టప్రధానులు | సేవకుడు |

ఇతర జనం

### ఒకటో రంగం

### రాజుగారి దర్బారు

తెరయెత్తేసరికి, యెదురుగా రాజ సింహాసనం కనిపిస్తుంది. రాజుగారు ఇంకా రాలేదు. సింహాసనానికి కుడివైపున మహామంత్రీ ఎడమవైపున అష్టప్రధానులూ కూర్చునివుంటారు. ఇంతలో బాకాలు వినపడతయ్. అందరూ వింటారు-లేస్తారు. చోపుదార్లు తోవచూపగా రాజుగారు ప్రవేశిస్తారు. సింహాసనంమీద కూర్చుంటారు. అందరూ 'మహారాజుగారికీ జై!' అని అరుస్తూ దణ్ణాలుపెడతారు.

రాజు: మహామంత్రీ! ఇవ్వాళ విశేషాలు ఏమిటి?

మహామంత్రి: ఏమీలేవు మహాప్రభూ!

రాజు: మన రాజ్యంలో ప్రజలంతా క్షేమంగా వున్నారా?

మహామంత్రి: ఉన్నారు ప్రభూ!

రాజు: దసరాపండుగ ఎప్పుడు?

మహా: వచ్చే సోమవారంనాడే ప్రభూ!

రాజు: మా ఊరేగింపుకు అన్ని సన్నాహాలూ చేయిస్తున్నావా?

మహామంత్రి: చేయిస్తున్నాను ప్రభూ!

రాజు: మనం పాటి రాజుల్లోకల్లా హోదాగలవాళ్లం. కాబట్టి, దసరా ఊరేగింపులో సాటి రాజుల్ని మించేటట్లుగా ఎక్కువ ఖరీదు, నాణ్యం, పనితనంగల దుస్తుల్ని మేము ధరించాలి.

రచన: కొప్పరపు సుబ్బారావు

మహామంత్రి : ధరించండి ప్రభూ !

రాజు : మన రాజ్యంలోని సాలెవాళ్లు మాకు బొత్తుగా నచ్చలేదు. సీమలో వున్నారట మాంచి సాలీలు. పిలిపించమని నీకు చాలారోజులక్రితమే ఆజ్ఞయిచ్చాం. ఇంకా పిలిపించలేదేం ?

మహామంత్రి : సీమ యేలుతూ వున్న రాజుగారికి మీకోరిక తెలియజేశాను. వారు ఇద్దరు సాలీలను పంపించారు.

రాజు : భేష్ ! భేష్ ! చెప్పవేం మరి ?

మహామంత్రి: దేవరవారి దర్శనం కోసం ఆ సాలీ లిద్దరూ ద్వారంవద్ద వేచి వున్నారు.

రాజు : సంతోషం! సంతోషం! తొందరగా ప్రవేశపెట్టు.

మహామంత్రి ఒక సేవకుడికి సైగచెయ్యగా వాడు వెళ్లి ఆ యిద్దరు సీమ సాలీలనూ తీసుకువస్తాడు. సాలీలు రాజుగారికి వంగివంగి దండాలు పెడతారు.

రాజు : ఎవరు మీరు ?

ఇద్దరు సాలీలు: మా రాజుగారు పంపగా సీమనుంచి వచ్చిన సాలీలం ప్రభూ !

రాజు : అందంగా నాణ్యంగా నెయ్యడం మీకు తెలుసా ?

1 వ సాలీ: మహారాజులంతా మాచేత నేయించుకుంటారు ప్రభూ !

2 వ సాలీ: మేము నేసే చాపులు సాలెగూటి పోగుకంటె సన్నంగా తెల్లగా వుంటాయి దొరా !

1 సాలీ : మా నేతలో, ప్రపంచం కనీ వినీ యెరగని ఒక మహిమ వుంది ప్రభూ !

రాజు : (ఆత్రంతో) ఏమిటా మహిమ ?



పుస్తకాల పురుగు

1 వ సాలీ : మేము నేసిన చాపులు, లంచాలుతినే ఉద్యోగులకూ వివేకంలేని రాజులకూ ఎంతమాత్రం కనిపించవు. మిగతావాళ్లకే కనిపిస్తాయి.

2 వ సాలీ : తక్కిన సాలీల నేతకూ మా నేతకూ అదే తేడా.

రాజు : (ఎంతో ఉత్సాహంతో) భేష్ ! భేష్ ! అలాటి మహిమగల దుస్తుల్ని ధరించడమే మా హోదాకు సరిపోతుంది. మహామంత్రీ ! వీళ్లకు కోరినంత ధనమూ సామగ్రీ యిచ్చి తొందరగా తయారు చేయించు ! నీకూ నీ అష్ట ప్రధానులకూ ఈక్షణం మొదలు ఇదేపని. ఇహ ఇవ్వాళకి దర్బారు ముగిస్తున్నాం.

అందరు : మహారాజుగారికి జై !

(తెర నెమ్మదిగా దిగుతుంది)

## రెండో రంగం

### రాజుగారి మేడలో గది

(సోమవారంనాడు)

తెరయెత్తేసరికి, సాలీలిద్దరూ చెరో మగ్గంముందు కూర్చుని, నిజంగా నేస్తున్నట్లే కాళ్ళూ చేతులూ బహు చురుకుగా ఆడిస్తూవుంటారు. నేలమీద ఒక చాప, ఆ చాపమీద జరీపోగుల కుప్పలూ, చీనా పట్టునూలు కుప్పలూ ఉంటాయి. ఇంతలో ఒక సేవకుడు ఇంకా కొన్ని జరీపోగుకట్టలూ, పట్టునూలు కట్టలూ నెత్తిమీద పెట్టుకుని ప్రవేశిస్తాడు.

1వ సాలీ: (సేవకుడితో) రాజుగారికి మా దండాలు చెప్పి, ఈ జరీపోగులు చాలవనీ యింకా రెండింతలు కావాలనీ మనవిచెయ్. వాటని ఆ చాపమీద పెట్టి ఇహ వెళ్ళు.

సేవకుడు అకట్టల్ని చాపమీదపెట్టి, వెళ్లిపోతూ ఒక్కసారి మగ్గాలకేసి ఓరచూపులు చూస్తాడు. మగ్గాలమీద ఏమీ కనపడవు. గాభరాపడి బిత్తరి చూపులతో వెళ్లిపోతాడు.

1వ సాలీ: తమ్ముడూ! మన కష్టానికి తగినఫలం ఇన్నాళ్లకు దొరికింది. ఇహ, ఆ కట్టలన్నిటినీ మన పెట్టెలోసద్ది తాళం వేసేద్దాం రా!

ఇద్దరూలేచి, అకట్టల్ని పోగుచేసి పెట్టెలో పెట్టి తాళంవేస్తారు. మళ్ళీవచ్చి, చెరోమగ్గం ముందు కూర్చుని వెనకటి మాదిరిగానిజంగా నేస్తున్నట్లే కాళ్ళూచేతులూ తెగ ఆడిస్తుంటారు. ఇంతలో అష్ట (ఎనిమిదిమంది) మంత్రులు ప్రవేశిస్తారు. మగ్గాలకేసి ఎగాదిగా చూస్తారు. ఏమీ కనపడవు. ఎవరిమనసులో వారికి గాభరాపుడుతుంది. సాలీలు అమగ్గాలనుంచి చాపులను తీసినట్లూ మడతలు పెడు తు న్న ట్లూ అభినయిస్తూ.

1వ సాలీ: మంత్రుల్లారా! దండాలు! దండాలు! యిదుగో ధోవతి! అదుగో ఉత్తరీయం! వీటి అందం నాణ్యం పనితనం ఎలావున్నాయి?

1వ మంత్రి: (రెండో మంత్రితో కొంచెం సందేహంగా) మీ అభిప్రాయం ఏమిటి?

2వ మంత్రి: మీ అభిప్రాయం ఏమిటి?

1వ మంత్రి: నాకు - అంటే - నామటుకు నాకు - చాలా అద్భుతంగానే కనపడుతున్నాయి.

2వ మంత్రి: నాకూ అంతే.

3వ మంత్రి: నా కళ్లకు పండువెన్నెలలాగా మిలమిల మంటున్నాయి.

4వ మంత్రి: నా కళ్లకు ఇంద్రధనుస్సులాగా మెరిసిపోతున్నాయి.

5వ మంత్రి: నా కళ్లకు బంగారపు రేకుల్లాగా కనపడుతున్నాయి.

6వ మంత్రి: నా కళ్లకు సీతాకోకచిలక రెక్కల్లాగా జిగిజిగి మంటున్నాయి.

7వ మంత్రి: చూడగా చూడగా, నేను కలలోవున్నానా అనిపిస్తూ వుంది.

8వ మంత్రి: (ఏడవ మంత్రితో) నేనూ అదే చెప్పబోతున్నా. ఇంతలో మీరే చెప్పేశారు.

తొందర తొందరగా మహామంత్రి ప్రవేశిస్తాడు.

మహామంత్రి: ఊరేగింపుకు వేళ అయింది. రాజుగారు చాలా తొందరపడుతున్నారు. యింకా తయారుకాలేదా?

ఇద్దరు సాలీలు: మహామంత్రిగారికి దండాలు! దండాలు! తయారుచేశాం. యివిగో చూడండి!

ఇద్దరు సాలీలూ చెరోచాపును విప్పి చూపిస్తున్నట్లే చేతులతో అభినయం చేస్తారు. ఎంత చూసినా మహామంత్రికి ఏమీ కనపడవు. తాను ముసలివాడు. చూపుతక్కువ. కాబట్టి కళ్లద్దాలు పెట్టుకుంటాడు. మళ్లీచూస్తాడు. అప్పటికీ ఏమీ కనపడవు.

మహామంత్రి : (తనలో) ఏమిటీ వింత! ఏ చాపూ నాకు కనిపించడంలేదు. కనిపించడంలేదని చెబితే నన్ను లంచగొండి మంత్రి అంటారు. గట్టి చిక్కే వచ్చిందే!

1 వ సాలీ: మహామంత్రిగారూ! సెలవియ్యండి! ఎలావుంది మా పనితనం?

మహామంత్రి: అద్భుతం! అద్భుతం! ఓహోహో హో!. ఏమి రంగులు! ఎంత నాణ్యం! ఎక్కడా కనీ వినీ యెరగను.

అప్పుడు తెరలోపల బాకాలువినిపిస్తాయి.అందరూ వింటారు. కొంచెంసేపటికి, ఇద్దరు చోపుదార్లు తోవ చూపగా రాజుగారుప్రవేశిస్తారు. అంతా వంగివంగి దణ్ణాలుపెడుతూ 'మహారాజుగారికి జై'అంటారు.

రాజు: ఇందరు మంత్రులు వుండి కూడా యింత ఆలస్యం ఎందుకయింది? మాకు చాలా కోపంవచ్చింది. విచారిద్దామని స్వయంగా వేంచేశాం.

మహామంత్రి: కోపంవద్దు మహాప్రభూ! అవిగో! తయారైనాయి! చూడండి!

రాజు: ఏవీ? ఎక్కడ?

మహామంత్రి: అవిగో వాళ్ళచేతుల్లో! ఒక ధోవతీ ఒక ఉత్తరీయం!

అష్టమంత్రులు: ఏమి అందం! ఎంత నాణ్యం! ఎలాటి పనితనం!

రాజు: (తనలో) ఏమిటీ వింత! నాకు యేవీ కనిపించడంలేదు. నిజంగా నేను వివేకంలేని రాజునా? ఈ సంగతి పైకి తెలిస్తే ప్రజలు నన్ను లెక్కచెయ్యరు.



రొయ్యకులేదా బారెడు మీసం!

(పైకి) భేష్! భేష్! అద్భుతం! అద్భుతం! (సాలీలతో) మీ పనితనాన్ని చాలా చాలా మెచ్చుకున్నాం. మీకు చెరో గ్రామం ఈనామిస్తాం.

యిద్దరు సాలీలు: (దణ్ణాలుపెడుతూ) మహారాజుగారికి జయీభవ! దిగ్విజయీభవ!

రాజు: ఈ చాపుల్ని మేము యిప్పుడే ధరించాలి.

1 వ సాలీ: దేవరా ఈ చాపుల్ని మా చేతులతో మేమే కట్టాలి.

రాజు: భేష్! అలాగే కానియ్యండి.

2 వ సాలీ: మీరుకట్టిన ఆ పాతచాపును విప్పాలి. వీరందర్నీ బయటికి పొమ్మని అజ్ఞ యివ్వండి.

రాజు: మేమూ ఈ సాలీలూ తప్ప యిక్కడ ఎవ్వరూ ఉండరాదు. అంతా బయటికి పోండి!

(అంతా వెళ్ళిపోతారు)

రాజుగారు కట్టుకునివున్న ధోవతిని సాలీలు విప్పుతూవుండగా, తెర గబాగబా దిగుతుంది.

## మూడో రంగం

### రాజవీధిలో

(అదే రోజున)

తెరయెత్తేసరికి రాజవీథి కనిపిస్తుంది. వీధికి రెండు వైపులా బార్లుతీర్చి జనం తండోపతండాలుగా నిల్చున్నారు. రాజుగారూ ఊరేగింపూ ఇంకా రాలేదు. మహామంత్రీ అష్టమంత్రులూ మాత్రం ముందు ప్రవేశిస్తారు (వీధులు తనిఖీచెయ్యడానికి)

మహామంత్రి: (ఒకటో మంత్రితో) ఆ సీమచాపులు ధరించినతర్వాత మన రాజుగారు అచ్చంగా మన్మథుడులాగే కనపడుతున్నారు.

1 వ మంత్రి: వాళ్ళు సాలీలు కారు! నిజంగా దేవతలు.

2 వ మంత్రి: వినండి! వినండి! ప్రజలంతా 'రాజుగారికి జై' అంటున్నారు.

3 వ మంత్రి: ఊరేగింపు బయలుదేరింది.

4 వ మంత్రి: అటు చూడండి! ఆ పిల్లవాడు ఎందుకో పక్కున నవ్వుతూ చప్పట్లు కొడుతున్నాడు.

మహామంత్రి: ఎక్కడ? .... ఔను! ఏమిటో బిగ్గరగా అరుస్తున్నాడు కూడాను. ఏమిటా అరవు? బాగా వినండి!

1 వ మంత్రి: "రాజుగారికి దిసమొల ఎబ్బెబ్బే! రాజుగారికి దిసమొల ఎబ్బెబ్బే!" అని అరుస్తున్నాడు!

2 వ మంత్రి: ఆ పిల్లవాడొక్కడే కాదు. "రాజుగారికి దిసమొల ఎబ్బెబ్బే!" అంటూ ప్రజలందరూ అరవసాగారు, వినండి!

మహామంత్రి: మరి, అందరికీ దిసమొలగా కనిపిస్తే మనకు అలా కనిపించలేదేం? చాలా చిత్రంగా వుంది.

అష్ట మంత్రులు: మాకూ విచిత్రంగానే వుంది.

నవ్వులూ చప్పట్లూ 'రాజుగారికి దిసమొల, ఎబ్బెబ్బే!' అనేకేకలూ వినిపిస్తూ వుంటాయి! మహామంత్రీ అష్టమంత్రులూ గుడ్లు అప్పగించి గుటకలు మింగుతూ వుంటారు.

(తెర మెల్లిగా దిగుతుంది)





రబ్బరు విమానాలు!

*Photo by—R. Krishnan*



బొమ్మలు తీసింది:

ఎక్కటం

ఈ ఆటలు చూశారూ? ఇటువంటివి ఆడుకోటంవల్ల శరీరానికి కలిగే వ్యాయామంకంటే, మనసుకు కలిగే ధైర్యం, సంతోషం జాస్తి. ఇవి పిల్లల ఆరోగ్యానికి అధికంగా తోడ్పడుతాయి.

టి. యస్. సత్యం



జారట

మీ బళ్లో ఇటువంటివి లేవుకదూ? ఇవి పట్టణాలలో ఉండే బళ్లలోనే ఉన్నాయి. ఇవి ప్రతి పల్లెటూరి బడిలోనూ ఉండేటట్టు చూడాలి. ఇలాంటి ఆటలు కావాలని మీ నాయనలనూ, పంతుళ్లనూ అడుగుతారుకదూ?

# సంక్రాంతి ముగ్గులు











క. వ. శివకల్యాణి,
వినుకొండ.





బులుసు రమణమ్మ,
బరంపురం.



కౌడాలి బసవపూర్ణమ్మ,
పెదరాపూరు.



జి. యస్. రత్నం,
భద్రాచలం.







రావూరి లలిత, మదరాసు



సన్నిధి వెంకట వరలక్ష్మి, వినుకొండ.



# కొత్తా-పాతా

ఒక అమ్మాయిదగ్గిర చాలా బొమ్మలు ఉండేవి. ఆ అమ్మాయి అడిగినప్పుడల్లా వాళ్ల నాన్నగారు బొమ్మలు కొనిఇచ్చారు. అందుచేత ఆ అమ్మాయిదగ్గిర చాలా బొమ్మలు ఉండేవి. వాటిని అరుగుమీద పెట్టుకొని ఆ అమ్మాయి రోజూ ఆడుకునేది.

ఒకనాడా అమ్మాయి ఏంచేసిందంటే, వాళ్లనాన్నగారితో. "నాన్నారూ, నాన్నారూ! నా బొమ్మలన్నీ పాతబడిపోయాయి. చక్కని కొత్తబొమ్మ తెచ్చిపెట్టరూ?" అని అడిగింది.

మరేనని వాళ్ళనాన్నగారు ఎగ్జిబిషనులో చక్కని చందనపుబొమ్మకొని పట్టుకొచ్చి అమ్మాయికిచ్చారు. బొమ్మఎంతో ఖరీదైనది. చక్కని సువాసనగలిగి ఎంతో ముద్దొస్తోంది. అమ్మాయి పాతబొమ్మలఊసే మరిచి ఈ కొత్తబొమ్మతోనే ఆడుకుంది. దానికి చక్కని దుస్తులుకుట్టింది. పూసలు పెట్టింది. దాంతో చాలాసేపు ఆడుకుని భోజనానికి వెళ్ళింది

ఆ అమ్మాయి భోజనంచేసి వచ్చేసరికి పాతబొమ్మలకీ కొత్తబొమ్మకీ పెద్ద పోట్లాట జరుగుతున్నది



ఒక పాత చంద్రకొయ్యబొమ్మ చందనపు బొమ్మతో, "ఏయ్, దూరంగా ఉండు. మాలోకి రాకు. మేమంతా ఎంతోకాలం ఇక్కడ ఉన్నవాళ్ళం. నువు ఇవాళ వచ్చినదానివి" అన్నది.

"నేను మాత్రం మీమాదిరిగా వచ్చినదాన్ని కాదా? ఏమిటి మీ అధిక్యం?" అని అడిగింది చందనంబొమ్మ.

"మేము చాలా కాలంగా ఈ అమ్మాయితో ఆడుకున్నాం. మాకా అమ్మాయిని గురించి అంతా తెలుసు! నీకేం తెలుసు? నీతో ఆ అమ్మాయి ఏం కష్టసుఖాలు చెప్పకుంది? ఆమె ఏడుపు నువ్వెప్పుడు పోగొట్టావు?" అన్నది చంద్రకొయ్యబొమ్మ.

"ఐతేనేం? మీరంతా ఇక్కడ చాలా కాలమై ఉండవచ్చు. నేను మీకన్న ఖరీదైనదాన్ని. నా వాసనే వేరు, నా జాతే వేరు. అందుచేతనే ఆ అమ్మాయికి నేనంటే అంతయిష్టం. నేను దగ్గర ఉండగా మీ మొహం చూడదు. అన్నిగుడ్డలూ నాకే చుట్టుతుంది. అన్నిపూసలూ నాకే పెట్టుతుంది" అన్నది చందనంబొమ్మ.

"అదా నీ అహంకారం? కొత్తలో మాకూ ఇవన్నీ పెట్టింది. కొత్తలో మామీదా ఇంత అపేక్షగానే ఉంది. కాని మేము అలవాటయాక అటువంటివేవీ అవసరం లేకపోయింది. అంతేకాని మేమంటే ఆమెకు ప్రేమ లేక కాదు. బొమ్మల కొలువుచేస్తే మేము లేకుండా ఎన్నటికీ చెయ్యదు. మేము ఎన్నేసి బొమ్మలకొలువులు అలంకరించామో నీకేం తెలుసును?" అన్నది చంద్రకొయ్యబొమ్మ.

"పాతదాన్నని నిక్కుతావేమిటి? పాత రోత, కొత్తవింత! మిమ్మల్ని చూసి మొహం మొత్తబట్టే నన్ను కొనిపించుకుంది. నేను కూడా పాతపడేసరికి మీలాగే అవుతాను. అప్పుడు నన్నుకూడా మీతోపాటే తోసేసి కొత్తబొమ్మలు కొనుక్కుంటుంది. అంత





వరకూ నాదే అగ్రస్థానం. మీరు పక్కకి తప్పుకోండి" అన్నది చందనంబొమ్మ.

ఈమాటకు కోపంవచ్చి చంద్రకొయ్య బొమ్మ చందనం బొమ్మమీద కలియబడింది. చందనంబొమ్మకూడా పోట్లాటకు దిగింది.

ఇంతలో ఆ అమ్మాయి ముందుకొచ్చి, ఈవిధంగా చెప్పింది:

"ఎందుకర్రా, మీలో మీరు పోట్లాడుకుంటారు? నాకు పాతబొమ్మలూ, కొత్తబొమ్మలూకూడా యిష్టమే. పాతబొమ్మలతో చాలాకాలం ఆడుకున్నాను గనక, కొత్తబొమ్మలతో ఎక్కువగా ఆడుకుంటాను. యింకా చాలా కొత్తబొమ్మలు కొంటాను. అందుకని పాతబొమ్మలు కోపం తెచ్చుకోకూడదు. కొత్తబొమ్మలను దూరంగా ఉంచాలని పాతబొమ్మ లనుకోవటంతప్పు. పాతబొమ్మలను కొత్తబొమ్మలు గౌరవించక పోవటంకూడా తప్పే. అవసరం వచ్చినప్పుడు అందరికీ సమంగానే అలంకారాలు చేస్తాను. మీలో మీరు వృథాగా పోట్లాడుకోకండి." అని

ఈమాటలు వినగానే పాత బొమ్మలూ కొత్తబొమ్మా తమ పోట్లాటమానేసి ఈ విధంగా పాడుతూ నృత్యం చేయసాగాయి:

అక్కల్లారా, చెల్లెళ్ళారా!<br>
అన్నల్లార, తమ్ముళ్ళారా!<br>
ఆడుకొందాం - రారండి!

చందనపుబొమ్మా, కుందనపుబొమ్మా!<br>
దంతపుబొమ్మా, దారువుబొమ్మా!<br>
ఆడేబొమ్మా, పాడేబొమ్మా!<br>
ఆడుకొందాం - రారండి!

పాతవిఅయినా, కొత్తవిఅయినా,<br>
అన్నిబొమ్మలె, అన్నీ ఒకటే!<br>
ఆదిరిపాటులూ మొదలికిచేటు;<br>
అందుకోసమే అంతాకలసి,<br>
ఆడుకొందాం - రారండి!



కోతి కొంగను రెండుసార్లు మోసంచేస్తే కొంగకూడా
కోతిని రెండుసార్లు మోసం చేయా లనుకున్నది



మొదట కొంగ గొడుగు మెడతోపట్టుకుని తీగెమీదనడిచి, కోతిని అలా చేయమంది



కోతి చేతిలో గొడుగుపట్టుకొని తీగెమీద అవలీలగా నడిచింది



ఈమాటు కొంగ గొడుగులేకుండా రెక్కలు బార్లాగా విప్పి నడిచింది.



కోతికూడా కొంగలాగే చేతులు బార్లాగా చాచి నడిచింది.
కాని చివరిదాకా రాకముందే ఢమ్మని కిందపడింది.



# చీమ కాశీ ప్రయాణం

అనగా అనగా ఒక చిన్న చీమ కాశీపట్నం వెళ్లాలని అనుకుంది. ఒక రోజు ఉదయం వాళ్ల తల్లికి ఆ సంగతి చెప్పింది.

"ఎందుకు అక్కడికి వెళ్తావు?" అంది పెద్ద చీమ. "అక్కడ పెద్దగుళ్లో పెద్ద బెల్లం ముక్కలు నైవేద్యం పెడతారని నల్లి బావ రాత్రి నాతో చెప్పాడు. అందుకనే దాన్ని తినకుండా రాత్రి వదిలి పెట్టాను" అన్నది చిన్న చీమ.

"కాశీపట్నం చాలా దూరం, నీవు వెళ్లలేవు" అన్నది పెద్దచీమ.

తల్లిచీమ మాట వినకుండా చిన్నచీమ కాశీకి బయలుదేరింది.

కొంతదూరం వెళ్లిన తర్వాత త్రోవలో దోమ కనుపించి, "చీమా చీమా, ఎక్కడికి ప్రయాణం" అని అడిగింది. "కాశీకి వెళ్తున్నాను" అంది చీమ. "చద్ది అన్నంమూట ఏదీ! ఎన్నాళ్లకు వెళ్తావో? దారిలో ఏం తింటావు?" అని దోమ నవ్వింది.

"అయితే మా అమ్మను అడిగి తెచ్చుకుంటా"నని



చీమ తనయింటికి తిరిగి వచ్చి తనతల్లితో జరిగిన సంగతి చెప్పింది.

"సరే వడ్లగింజలు పొలంలో వేసివస్తే ఒక సంవత్సరంలో చాలా ధాన్యం చేతికి వస్తుంది. అప్పుడు నీవు అన్నము వండించుకొని చద్దిమూట కట్టుకొని కాశీకి వెళ్తువు గాని" అన్నది తల్లిచీమ.

ఆ సంవత్సరానికి చీమ ప్రయాణం ఆగింది. అనుకున్న ప్రకారం మరుసటి సంవత్సరం చద్దిమూట కట్టించుకొని చిన్న చీమ మళ్ళీ ప్రయాణం అయింది కాశీకి.

కొంతదూరం వెళ్లిన తర్వాత ఒక ఈగ చీమను చూచి పకపకా నవ్వింది.

"ఎందుకు నన్ను చూచి నవ్వుతావు?" అంది చీమ.

"కాశీకి వెళ్తున్నావు గదా, చలికి కప్పుకోటానికి దుప్పట్లేవి?" అంది ఈగ.

మళ్లీ ప్రయాణం ఆపుకుని యింటికి వచ్చి ఆ సంగతి తల్లిచీమకు చెప్పింది పిల్లచీమ.

"అయితే మన దొడ్లో ప్రత్తిచెట్టు బాగా పెరిగితే దూది వస్తుంది. దాంతో నువ్వు దుప్పటి తయారు



చేయించుకుంటువు గాని" అని అన్నది తల్లిచీమ.

సంకా శ్రీధరబాబు, తెనాలి.

ప్రయాణం ఆగింది. ఒక సంవత్సరము అయిన తర్వాత దూది వచ్చింది.

ఒక రోజున యింట్లో సాలిపురుగు దోమనుచంపి దాని నెత్తురుత్రాగి పనిలేక గోడమీద అటు యిటు తిరుగుతూంది.

"ఓసాలిపురుగూ నాకు దుప్పటి తయారు చేసి యివ్వవూ?" అని అడిగింది చిన్న చీమ.

సరేనని సాలీడుదుప్పటి తయారు చేసి చీమ కిచ్చింది.

ఆ సంవత్సరం చీమ మళ్ళీ కాశీకి ప్రయాణం అయి కొంత దూరం వెళ్ళిన తర్వాత పేను కనపడి తెగనవ్వింది.



"ఏంపేనూ ఎందుకట్లా నవ్వుతావు?" అనిఅడిగింది చీమ.

"నీవు కాశీకి ఎప్పటికి వెళ్తావు చీమా? యీలోగా ఎన్నోఎండాకాలాలొస్తయ్. కాళ్లకి చెప్పులేవి?" అంది, ఆ మాయదారి పేను.

"ఓహో, అట్లా గా!" అంటూ చీమ చిటుక్కున వెనక్కు తిరిగి యింటికి వెళ్ళి తల్లితో జరిగిన సంగతంతా చెప్పింది.



"అయితే యింకా రెండేళ్లు ఆగు. ఈలోగా నీ ఆరు కాళ్ళకు ఆరుచెప్పులు కుట్టించి కాశీకి పంపుతాలె" అంది తల్లి చీమ.

రెండేళ్ళు ఆగినతర్వాత మాలవాడు తెచ్చిన ఆరు చెప్పులలో చీమ ముందు కాళ్లకు ఒకజత చెప్పులు సరి పోయినయ్. మధ్య కాళ్లవి వొదు లయినయ్. వెనక రెండు కాళ్లకు మాల



వాడు చెప్పులు తొడిగి తీస్తూంటే చెప్పుల్లో కాళ్ళు ఇరిగిసిపోయి వెనకాళ్ళు రెండూ విరిగి పోయినయ్.

పాపం! చీమ ఏడుస్తూ యింకా మిగిలిన నాలుగు కాళ్లతో కాశీకి వెళ్లలేనని వాళ్ల అమ్మకుచెప్పింది.

"చిన్న చీమా—ఏడవకు—ఏడవకు—నీవు వెళ్ల లేకపోతే కాశీ పట్నాన్నే మనవూరు పిలి పిస్తానులే" అంది తల్లి చీమ.

ప్రతిరోజూ యిప్పటికీ నిద్రనుంచి లేవడంతోనే ఆ చిన్నచీమ ఒక యిటిక ముక్క మీదకి ఎక్కి కాశీపట్నం వాళ్ళ వూరు వచ్చిందేమో నని కళ్ళు కాయలు కాసేట్టు చూస్తూ వుంటుంది.

# ఈ కుక్కబొమ్మలు చూశారా?






ఇవి పెనిసిల్‌తో గీచినవి.
"స్వామి" అనేవారు వీటిని గీచారు.



ఈ కాట్లాడుకునే కుక్కలబొమ్మ ఉండే కొయ్యమీద చేతితోచెక్కినది.
ఈ పని చాలా కష్టం. దీన్ని చెక్కినది 'ప్రసన్న' అనేవారు.




ఒకరాత్రి భయంకరమైన ఉరుములతో, మెరుపులతో, ధారాపాతంగా వర్షం కురుస్తోంది. దానికి తగ్గట్టు ఈదురు గాలికొట్టి అమితచలి వేస్తోంది. ఇటు వంటి వర్షంలో చిక్కుకున్నది ఒకపులి. వానకి తడిసి, చలికి వొణుకుతూ, ఎక్కడికి పోవటానికీ తోచక ఒకపూరిగుడిసె పంచన నిలబడింది.

ఇంతలో ఒక చాకలివాడు, పూటాగా తాగి, పెద్దగా పాడుకుంటూ, గాలివాన సంగతే తెలియకుండా, ఆదారిన వచ్చాడు. ఆరోజే వాడిగాడిద ఎటో తప్పించుకుని పారి పోయింది. వాడు వానలోపడివస్తూ గుడిసెపంచన నిలబడి ఉన్న పులినిచూసి తనగాడిదే అను కున్నాడు. వెంటనే పాడటం ఆపి పులిని సమీపించి, "ఆసి నిన్ను నరకా! ఇక్కడ దాక్కున్నావా? నీకోసం ఊరంతాతిరిగి చచ్చానే! పద, యింటికి, నిన్నేం చేస్తానో?" అంటూ ఒకచేత్తో పులిచెవి పట్టి మెలిపెడుతూ, రెండోచేత్తో దాని వీపుమీద చరుస్తూ దాన్ని ఇంటికితోలుకు పోయాడు. అసలే గాలివానకి సగం చచ్చిఉన్న పులి వాడి వెంట వెళ్లింది.

చాకలి పులిని గుంజకు కట్టేసి ఇంటోకిపోయి అన్నంతిని పడుకుని హాయిగా నిద్రపోయినాడు.

మర్నాడు తెల్లవారి చాకలిదిలేచి బయటికివచ్చి చూసేసరికి గుంజకు పులి కట్టేసి ఉంది. చాకలిదానికి పైప్రాణాలు పైనేపోయాయి. అది గభాలున ఇంటో దూరి తలుపేసుకుని చాకలాడితో బయట



రాజుగారే సపరివారంగా బయలుదేరి వచ్చాడు. చాకలివాడికి ఈనాము లిచ్చే శాడు. ఏ ఆయుధమూ లేకుండా అడివిలో ఉండే పులినిపట్టినవాడు, ఆయుధా లిస్తే ఎంతకైనా సాధ్యుడే అనుకుని, చాకలివాణ్ణి రాజుగారు తన సర్వసేనా నాయకుడుగా నియమించాడు.

ఇదిజరిగిన కొద్దికాలానికే మనరాజుగారిమీదికి శత్రురాజొకడు దండెత్తి వచ్చాడు. ఆ శత్రురాజుమీదికి సైన్యాలు నడపవలిసిన బాధ్యత మనచాకలిమీద పడింది. రాజుగారు వాడికి మంచి గుర్రాన్నికూడా ఇచ్చాడు. కాని మన చాకలి ఎన్నడూ గుర్రం ఎక్కినపాపాన పోయినవాడు కాడు. అటువంటివాడు శత్రుసైన్యాల మీదికి సేనలను ఎట్లా నడుపుతాడూ? అందుకని రాజుగారితో చాకలి ఏమన్నాడంటే, "మహారాజా, ముందుగా నేనువెళ్లి శత్రుసైన్యాలను రహస్యంగా తనిఖీచేసి వస్తాను. నాకు రెండు రోజులు గడువిప్పించండి," అన్నాడు. రాజుగారు సరేనన్నాడు.

పులి ఉన్నసంగతి చెప్పింది. తాను రాత్రి పట్టుకొచ్చినది పులి అని తెలియగానే చాకలివాడికికూడా భయంపుట్టి వాడు బయటికేరాలేదు.

కాని కాస్సేపటికల్లా 'చాకలివాడు ఇంటిముందర పులిని కట్టేశా'డనే వార్త ఊరంతా పాకింది. ఊళ్లో వాళ్లంతా వాణ్ణీ పులినీ చూడవచ్చారు. వాడి పరాక్రమం చుట్టుపక్కల గ్రామాలకుకూడా పాకి ఆఖరుకు రాజుగారికికూడ చేరింది. ఇంకేముందీ? ఈవింత చూడటానికి

చాకలి ఇంటికివచ్చి, "ప్రాణం మీదికి వచ్చిందే! ఏమిటి ఉపాయం?" అని పెళ్ళాన్ని అడిగాడు.

ముందు చాకలి కనీసం గుర్రాన్ని ఎక్కడమైనా నేర్చుకోవాలిగా? ఆపని చెయ్యమని చాకలిది సలహా ఇచ్చింది. పగటిపూట అయితే ఎవరైనా చూస్తారని పొద్దూకిన తరవాత చాకలివాడు ఎంతో కష్టపడి గుర్రంమీద ఎక్కి కూర్చున్నాడు. కాని ముఖం వెనక్కు తిప్పి కూర్చున్నాడు. ఇట్లా కూర్చోవటానికే ఎంతో ప్రయాస అయింది. అందుచేత వాడు మళ్ళా ప్రయత్నించక, "గుర్రం పరిగెత్తితే నేను పడిపోతానేమో? నన్ను గుర్రానికేసి గట్టిగాకట్టు," అన్నాడు.

సరేనని వాడిపెళ్లాం వాణ్ణి గుర్రానికేసి గట్టిగా కట్టేసింది. గుర్రం పరిగెత్తనారంభించింది.

అసలే అది ఉత్తమజాతి గుర్రం. ఎన్ని యుద్ధాలకో పోయి వచ్చింది. బయలుదేరితే బాణంలాగా పోవటం దానికి అలవాటు. అదీకాక దానికిసైన్యాల



మీదికి పరిగెత్తటం తెలుసు. అందుచేత అది చాకలవాణ్ణి వేసుకుని శత్రుసైన్యాల మీదికి వాయువేగ మనోవేగాలతో పరిగెత్త సాగింది.

ముఖం వెనక్కి తిప్పి ఉండటంవల్ల చాకలివాడికిచాలా సేపు తాను ఏదిక్కుగా పోతున్నదీ తెలియలేదు. కాని దూరాన గుర్రాల నకిలింపులూ, జనుల కలకలమూ వినపడి వాడు వెనక్కు తిరిగి గుర్రం పోతున్న దిక్కు చూసేసరికి శత్రుసైన్యాల డేరాలూ, వందలాదిగా సైనికులూ

కనపడ్డారు. వెంటనే మనచాకలికి పై ప్రాణాలు పైనే పోయాయి. గుర్రంపరుగు ఆపటానికి ఏ ఉపాయమూ తోచక దారిలో తనపక్కగా అందిన చిన్న తాడిచెట్టును గట్టిగా వాటేసుకున్నాడు. అట్లాగూ ఆగుర్రం ఆగలేదు. తాడి చెట్టు పెల్లగిలి చాకలి చేతుల్లోకివచ్చినా గుర్రం పోతూనే ఉంది.

ఆ మసక చీకట్లో మైదానంమీద శత్రుసైనికులకు గుర్రమూ, గుర్రము మీద ఒక మనిషీ, వాడిచేతిలో బ్రహ్మాండ మైన ఆయుధమూ కనిపించాయి. అర్ధ రాత్రి ఒంటరిగావచ్చే ఈ వీరుడు మానవమాత్రుడు కాడనుకుని శత్రు సైన్యాలు, డేరాలూ, గుర్రాలూ విడిచి పెట్టి ఎక్కడివారక్కడ పారిపోయినారు. చాకలి శత్రుశిబిరం చేరేసరికి ఒక్క పురుగులేదు. గుర్రం ఆగిపోయింది. చాకలిది కట్టిన కట్లన్నీ క్రమంగా ఊడి పోయాయి. చాకలి సొమ్మసిల్లి పడి పోయాడు.

మర్నాడుదయం చాకలి రాజుగారి దగ్గిరికివెళ్లి, "మహాప్రభూ! శత్రువులు పిరికిపెధవలు. నా ఒక్కడి దెబ్బకే తట్టుకోలేక కాలికి బుద్ధిచెప్పారు. మన సైన్యాలు కూర్చ నవసరమే లేదు," అని విన్నవించాడు.

రాజుగారు పరమానంద భరితుడై చాకలికి ఇంకా మరికొన్ని జాగీర్లూ, ధనమూయిచ్చి వాణ్ణి తనవద్దనే ఉంచు కున్నాడు.

చాకలిపేరుచెబితే శత్రువులకు హడలైపోవటంచేత ఆ దేశంమీదికి మరెవ్వరూ తిరిగి దండెత్తి రాలేదు.



# మినపరొట్టెలు

వీరిన అప్పలరాజు

ఒక వూరిలో చాలా బీద బ్రాహ్మ డుండేవాడు. యాయవారం చేసుకుని బతికేవాడు. ఆ బ్రాహ్మడికీ, ఆయన భార్యకీ మినపరొట్టె తినాలని మోజు పుట్టింది. ఈ మోజుతీరే ఉపాయంలేదు. అందుచేత బ్రాహ్మడు భగవంతుణ్ణి గురించి తపస్సుచేశాడు. భగవంతుడు ప్రత్యక్షమై, 'ఏం వరంకావాలో కోరుకో' అన్నాడు.

"ప్రభూ, నాకు మినపరొట్టె తినాలని చాల భ్రమగాఉంది. కావలసినన్ని మినపరొట్టెలుదొరి కేవరం ఇప్పించు," అన్నాడు బ్రాహ్మడు.

"ఒక మినప గింజ సంపాదిస్తి వా, నీకు కావలిసి నన్ని మినపరొట్టె లు దొరుకుతాయి," అని భగవంతుడు మాయమైనాడు.



దేవుడు చెప్పిన ప్రకారం బ్రాహ్మడు దుకాణానికి వెళ్ళి ఒక్క మినపగింజ ముష్టిఎత్తాడు. ఆ గింజపట్టుకుని ఇంటికి సాగాడు బ్రాహ్మడు. ఒక్క అడుగు వేసేసరికి చేతిలోవున్న ఒక మినప గింజ రెండయాయి. మరో అడుక్కి నాలుగయాయి. బ్రాహ్మడు ఇంటికి వచ్చేసరికి భుజంమీద బస్తామినుము లున్నాయి.

ఇంటోకివెళ్లి బ్రాహ్మడు భుజంమీది మినుములబస్తా కిందదించేసరికి భుజం మీద ఇంకో బస్తా వుంది. అదిదించితే మరొకటి. ఎన్ని దించినా బ్రాహ్మడి భుజంమీద మినుములబస్తా ఉండనే ఉంది. బరువుకు తాళలేక బ్రాహ్మడు గోడకి చేరగిలబడి పోయాడు.




ఇంతలో భార్యవచ్చి బ్రాహ్మడు దింపిన బస్తాలలో ఒకటివిప్పి కొన్ని మినుములుతీసి తిరగట్లోవేసి విసర సాగింది. మినుములన్నీ పప్పుఅయాక చూస్తే మళ్ళీ తిరగట్లో ఇన్ని మినుములు ఉండనే ఉన్నాయి. ఎన్నిసార్లు విసిరినా తిరగట్లో మొదటపోసినన్ని మినుములూ ఉండనే ఉన్నాయి.

ఇదేం ఖర్మ మని తిరగలి వొదిలేసి బ్రాహ్మడి భార్య విసిరినపప్పు పట్టు కెళ్లి రోట్లో రుబ్బసాగింది. రుబ్బు తీసి చూస్తే రోట్లో ఇంకో రుబ్బుఉంది. అదితీస్తే మరొక రుబ్బున్నది.

ఆవిడకి విసుగెత్తి రుబ్బిన పిండి పట్టుకెళ్లి వంటింటో పొయిమీద పెనం పెట్టి పెనంమీద అట్టువేసింది. రొట్టె కాలింది. దాన్నితీసి పళ్లెంలో వేసిచూస్తే పెనంమీద ఇంకో రొట్టెఉంది. అది కూడా తీస్తే మరోరొట్టె. ఎన్నిరొట్టెలు తీసినా పెనంమీద మరోరొట్టె ఉండనే ఉంది.

పెనంమీద రొట్టె అలాగే ఉంది. రోట్లొ రుబ్బు అలాగే వుంది. తిరగట్లో మినుము అలాగే ఉన్నాయి. బ్రాహ్మడి భుజంమీద మినుములబస్తా అలాగేఉంది.

ఇంతలో పొరుగింటి ముసలమ్మ నిప్పుకోసం వచ్చింది. ఇంటినిండా మినుములబస్తాలు చూసింది. వంటింటో



పొయ్యిమీది పెనంలో రొట్టెచూసింది. ఉప్పు సరిపోయిందోలేదో చూద్దామని ఒక్క ముక్కతుంచి నోట్లో వేసుకుంది. నమిలింది. మింగింది. మళ్ళీ నోట్లో ముక్క అలాగేఉంది. మళ్లీ నమిలి మింగింది. ఇంకా నోట్లోముక్క అలాగే ఉంది. నమిలి నమిలి నోరు నొచ్చిందే గాని, మింగీ మింగీ పొట్ట ఉబ్బిందేగాని నోట్లో ముక్కమాత్రం అయిపోలేదు. నమలకుండా, మింగకుండా ఊసినా ముక్క నోట్లో అలాగేఉంది.



ముసలమ్మకూడా ఆయాసంతో గోడకి చేరగిలబడి, "నిప్పుకోసం వచ్చిన దానికి ఇదేం పాపకర్మం చుట్టుకుందిరా, బాబూ! నీ మినపరొట్టె నిప్పచ్చరం గాను!" అని బ్రాహ్మణ్ణి తిట్టింది.

"రోలుపోయి మద్దెలతో మొరపెట్టు కున్నట్టుంది! భుజంమీద చచ్చేటంత బరువుపెట్టుకుని దించలేక నేనేడుస్తున్నాను! చాలురా, భగవంతుడా మినపరొట్టెలమోజు," అని బ్రాహ్మడేడిచాడు.

వెంటనే అంతా మాయమైపోయింది: బ్రాహ్మడి భుజంమీద మినుముల బస్తా లేదు. తిరగట్లో మినుములేవు. రోట్లో రుబ్బులేదు. పెనంమీద రొట్టెలేదు. ముసలమ్మనోట్లో ముక్కలేదు. బ్రాహ్మడు తెచ్చిన మినపగింజమాత్రం మిగిలింది.

"అగ్గిలేదు, బుగ్గిలేదు," అంటూ ముసలమ్మ మూల్గుతూ వెళ్ళిపోయింది.



# చావటంలో అనేకరకాలు

ఒక నదిమీద ఒక తొట్టిపడవ ఉండేది. దాన్ని నడిపే సరంగు అవతలి గట్టువారిని ఇవతలి గట్టుకూ ఇవతలిగట్టువారిని అవతలిగట్టుకూ పొద్దుకూకులూ చేరవేస్తూ ఉండేవాడు. వాడి జీవితమంతా ఈపనిలోనే గడిచింది.

ఒకరోజు ఒక మహా పండితుడైన బ్రాహ్మడు నదిదాటటానికి వచ్చాడు. ఇంకెవరైనా వస్తారేమోనని కొంతసేపు చూసి, ఎవరూ రానందువల్ల సరంగు బ్రాహ్మణ్ణి ఒక్కణ్ణే ఎక్కించుకుని బయలుదేరాడు.

ఆ సరంగును చూస్తే బ్రాహ్మడికి చాలా జాలివేసింది. "పాపం, నీది ఎంత నికృష్టపు జీవితం! నువ్వు బతికిఉండీ చచ్చినవాడితో సమానం!" అన్నాడు బ్రాహ్మడు.

"అదేం, బాబూ?" అన్నాడు సరంగు.

"నీకు శాస్త్రాలేవైనా వచ్చునా?" అని అడిగాడు బ్రాహ్మడు.

"రావు, బాబూ!" అన్నాడు సరంగు.

"ఇకనేం? నీ జీవితంలో సగంపాలు నష్ట. పోనీ నీకు పురాణాలేవైన తెలుసా?" అన్నాడు బ్రాహ్మడు.

"లేదు, బాబూ!" అన్నాడు సరంగు.

"చూశావా? నీ జీవితం మూడుపాళ్ళు వృథాయే. పోనీ నీకు కావ్యాలేవైనా వచ్చునా?" అని అడిగాడు బ్రాహ్మడు.

"తెలియదు, బాబూ! రోజల్లా పడవ తోసుకునే నాబోటివాడి కవన్నీ ఎట్లా తెలుస్తాయి?" అన్నాడు సరంగు.

"ఐతే నీజీవితంలో పధ్నాలుగుపాళ్లు వ్యర్థమే. నువ్వు రెండు వీసాలుమాత్రమే జీవిస్తున్నావు," అని చెప్పాడు బ్రాహ్మడు.

ఈపాటికి తొట్టిపడవ నదిమధ్యాకి వచ్చేసింది. ఇంతలో ఆకాశం మూసుకు వచ్చింది. భయంకరమైన కారుమేఘాలు నాలుగువైపులనుంచీ చేరసాగాయి. బ్రహ్మాండమైన గాలి లేచింది. నదిలో అలలు యింతెత్తున లేవసాగాయి. గాలిలో దీపంలాగా పడవ కొట్టుకోసాగింది. అది ముందుకుపొయ్యే అవకాశంగాని, వెనక్కు తిరిగిపొయ్యే అవకాశంకాని కనిపించలేదు. పడవలోకి నీళ్ళుకూడా రాసాగాయి.

సరంగు తెడ్డువెయ్యటంమాని "బాబూ, తమరికి ఈదటంవచ్చా?" అని అడిగాడు.

బ్రాహ్మడు ఖంగారుపడి, 'రాదే!' అన్నాడు.

"అయితే తమరి జీవితం పూర్తిగా వృథా!" అంటూ సరంగు నదిలోకిదూకి ఈదుకుంటూ వెళ్లాడు.

# గతిలేని భర్తకు మతిలేని భార్య

పూర్వం ఒకఊళ్లో ఒక ఆలూమగడూ వుండేవాళ్ళు. ఒకనాడు మొగుడికి గారెలు తినాలని ఆశపుట్టి భార్య దగ్గిరికివచ్చి "సామగ్రితెస్తాను, గారెలు చేసిపెట్టు" అన్నాడు. పెండ్లాం సరేనన్నది. మొగుడు బజారుకెళ్ళి కావలసిన సామగ్రి తెచ్చి యిచ్చి పొలంమీదికెళ్ళాడు.

పెండ్లాసకేమో గారెలు చేయడం అసలు తెలియదు. గారెలు "ఎట్లాగండి చేసేదీ?" అని వాళ్ళ ప్రక్కయింటిలో వున్న బ్రాహ్మణ విధవరాలిని అడిగింది. ఆమె "ఒక శేరు వుద్దిపప్పు నీళ్లలో నానబొయ్యి...." అని యింకేమో చెప్పబోయింది. "ఓస్! నాకూ తెలిసిందిలే" అని పైమాట వినకుండ యింటికివచ్చి నీళ్ళలో పప్పును నానబోసింది. అవతల ఏంచేయాలనో తెలియలేదు. మళ్లీ పక్కయింటామె దగ్గిరికిపోయి అడిగింది. ఆమె "ఆపప్పును వడబోసి...." అని యింకేమో చెప్పబోయింది. ఈమాటుకూడా పైమాటలు వినిపించుకోకుండా "ఓస్! ఇక తెలిసిందిలే" అని యింటికిపోయి పప్పువడబోసింది. కానితర్వాత ఏంచెయ్యాలో తెలియలేదు.

మళ్ళీ పక్కయింటి ఆమెను పోయి అడిగింది. ఈసారి ఆమెకి కోపం వచ్చింది. "ఏమి దీనికింత గీర్వాణం? చెప్పేదంతా పూర్తిగావిని తెలుసుకోదు. 'ఓస్! నాకు తెలిసిందిలే' అని వెళ్ళిపోతుంది. మళ్ళీ మళ్ళీ వచ్చి అడుగుతూ వుంటుంది. ఈమాటు దీనిపని పట్టిస్తాను!" అని మనసులో అనుకొని "అమ్మా ఆపప్పులో రెండు శేర్లు వుప్పు, నాలుగు శేర్లు నీళ్ళుపోసి పొయ్యిమీదపెట్టి దించు. గారెలవుతుంది" అన్నది. ఇంటికివచ్చి ఆ వెట్టిబాగుల్ది ఆప్రకారంగానే చేసింది.

ఇంతలో పొలంనుంచి గారెలు తిందాంగదా అని గంపెడాశతో సంబరపడుతూ మొగుడు వచ్చాడు.

అండాలు, మదరాసు—నిర్మల కుమారి, కర్నూలు.
క్రొవ్విడి సీతారామరావు, విశాఖపట్నం




సంగతంతా చెప్పింది. విధవరాలికి కోపంపోయి 'అయ్యో పాపం' అని నొచ్చుకొని "ఇప్పుడు నేను గారెలు కాల్చబోతున్నాను. అంతా సరిగ్గా నేను చేసినట్లు చెయ్యి"అని చెప్పింది.

తర్వాత ఆమె తల గొరిగించుకుని స్నానంచేసి మడికట్టుకొని పిండి రుబ్బి గారెలు వండింది.

పెండ్లాము అదంతా చూసుకొని ఇంటికివచ్చింది. మినుప్పప్పు నీటిలో నానబోసింది. ఒక మంగలాణ్ణి దొడ్లోకి రమ్మని నున్నగా తల గొరిగించు కొంది. స్నానంచేసి పక్కింటామె



అతన్ని కూర్చోమని ఒక దొన్నె ముందరపెట్టి 'దీన్ని పట్టుకోండి; గారెలు పోస్తాను' అంది. "ఒసే, ఇదేమిటే?" అని సంగతంతా అడిగి తెలుసుకొని విధవరాలు చేసినమోసం కనుక్కున్నాడు.

మర్నాడు "ఈమాటు అయినా ఆమెకు కోపంరాకుండా అంతా అడిగి తెలుసుకొని, సరిగా ఆమె చెప్పినట్లు గారెలుచెయ్యి"అని చెప్పి మళ్ళీ, కావల సినసామగ్రితెచ్చియిచ్చి పొలానికెళ్లాడు.

పెండ్లాము పక్కయింటి విధవరాలి దగ్గరికి మళ్ళీ పోయింది. ఆమెతో తన



దొడ్లో ఆరవేసుకున్న మడిచీరకట్టుకొని పిండి రుబ్బుతున్నది.



మరి కాస్సేపటికి మొగుడు పొలం నుంచి యింటికివచ్చి ముసుగుపెట్టుకొని పిండి రుబ్బుతున్న తన భార్యనుచూచి పక్కింటి విధవరాలనుకొని "ఏమే? అయ్యోపాపం! పక్కింటామెచేత పని చేయిస్తున్నావా?" అని ఇంటివేపుచూసి అడిగాడు. "అదేమిటండీ, అలాగంటారు! బామ్మగారిని కష్టపెట్టి పనిచేయించుకోటానికి నేనేం వెఱ్ఱిదాన్నా?" అంటూ ముసుగు తీసేసి భర్తవేపు తిరిగింది.

భార్య అవతారం చూడగానే భర్త



"ఒసే నీకు యిదేం పోగాలమే? నేను బ్రతికుండగానే బుర్ర గొరిగించుకు కూర్చున్నావు?" అంటూగొల్లుమన్నాడు.

భార్యకు ఎక్కడలేని ఉక్రోషం వచ్చింది. "చాల్లెండి. ఎంత చేసినా యింతే మీరు. బామ్మగారు చేసిందల్లా జాగ్రత్తగాచూసి గారెలు వండటం నేర్చుకోమంటిరి. సరే గదానని ఆవిడ గారు చేసినట్లే నేనూ చేశాను. ఇక నన్నెందుకు తిట్టి పోస్తారు?" అంటూ ఆ వెఱ్ఱిబాగుల భార్య కళ్లనీళ్లెట్టుకుంది.

పాపమా బ్రాహ్మడు మళ్లీ గారెలు చెయ్యమని అడిగిన పాపానపోలేదు.






జానకి, వసంత అక్క చెల్లెళ్ళు. ఒకసారి బొమ్మల పండుగ వచ్చింది. అక్క చెల్లెళ్ళిద్దరూ బొమ్మలను వరసగా పెట్టసాగారు. ఇలా పెడుతుండగా మధ్యలో ఏబొమ్మ ఉండాలా అన్న సమస్య వచ్చింది. జానకి సరస్వతి బొమ్మ పెట్టాలంది. వసంత లక్ష్మిబొమ్మ పెట్టాలంది. దాని మీద ఇద్దరికీ తగువు వచ్చింది. "లక్ష్మి కంటే సరస్వతి మంచిది," అన్నది జానికి. "కాదు సరస్వతికంటె లక్ష్మే మంచిది," అన్నది వసంత.

కాసేపు అక్కా చెల్లెళ్ళు తగువు లాడుకొన్నారు. చివరికి జానకి ఇలా అంది: "ఒక కథఉంది. అదివిని నీవు ఎలాచెబితే అలాచేదాము" అని యిలా కథచెప్పటం మొదలుపెట్టింది.

మనకు వచ్చిన తగాదాయే పూర్వం లక్ష్మీ సరస్వతులకు వచ్చింది. మానవులకు నేను ఎక్కువగా తోడ్పడ గలనంటే నే నెక్కువగా తోడ్పడ గలను అని వారిద్దరూ పోట్లాడు కొన్నారు. చివరికి లక్ష్మి "చూడు నా గొప్పతనం," అని బయలుదేరింది. సరస్వతికూడా ఆమెవెంట బయలు దేరింది.

ఆయిద్దరూ అలా పోయి పోయి ఒక మహారణ్యం చేరుకున్నారు. అడవిలో ఒక వేటగాడు ఉన్నాడు. మృగాలను వేటాడి వాటి చర్మాలను



ప్రక్కన ఉన్న పట్టణంలో అమ్ముకోవటం అతని వృత్తి. చదవటం వ్రాయటం అతనికి రావు. నూనెరాయని అతని జుట్టు రేగి చూడటానికి ఎంతో అసహ్యంగా ఉంటుంది. అతన్ని చూడగానే లక్ష్మికి జాలికలిగి అతనితో ఉంటూవచ్చింది.

లక్ష్మి దయవల్ల అతనిలోనూ, పరిసరాలలోనూ ఎంతో మార్పు వచ్చింది. అతని పూరిగుడిసె చక్కని అద్దాల మేడ అయింది. వెనకటి వికృతాకారం పోయి అతడు నవమన్మధుడులాగ తయారయ్యాడు.

ఆ అరణ్యానికి ప్రక్కన ఒక పెద్ద పట్టణం ఉంది. దానికి ఒక రాజు ఉన్నాడు. ఆ రాజు ఒకరోజున వేటకు వచ్చి నవమన్మధుడులాగా ఉన్న వేటగాణ్ణి చూచాడు. అతని రూపురేఖలుచూచి రాజు ఆశ్చర్యపోయి అతన్ని తనవెంట తన పట్టణానికి తీసుకువెళ్లాడు.

ఆ రాజుకు ఒక్కతే కూతుర



ఆమె పేరు మోహనవల్లి. ఆమె తనతండ్రి వెంటబెట్టుకువచ్చిన కొత్తమనిషిని ప్రేమించింది. రాజు అతనికి లక్ష్మీ మనోహరుడని పేరుపెట్టి గౌరవంగా చూస్తున్నాడు. తన కూతుర్ని మనోహరుని కిచ్చి పెళ్లి చేస్తే ఎంతో బాగుండు ననుకొంటున్నాడు.

ఒకరోజున లక్ష్మి మనోహరుడికిప్రత్యక్షమై "నేను ఉన్నంతకాలమూ నీకు ఎలాంటి కొరతా ఉండదు. కాని నేను వెళ్ళిపోతే అన్నీ నాతోనే పోతాయి," అని చెప్పింది.

"తల్లీ అలాగా! సరేకాని, నిన్ను ఒకటే కోరుతున్నాను. నువ్వు పోయేటప్పుడు మాత్రం ముందుగా చెప్పిపో; అమాత్రం దయచాలు," అన్నాడు మనోహరం. సరేనన్నది లక్ష్మి.

మరునాడు రాజు కొలువు తీర్చి ఉండగా మనోహరం ఎకాయెకినివెళ్లి రాజు కిరీటాన్ని ఎడమకాలితో ఒక్క తన్ను తన్నాడు. కిరీటంపోయి దూరంగా పడింది. రాజ భటులకు ఎక్కడ లేని కోపంవచ్చి అతన్ని నరికి వేయటానికి కత్తులు దూశారు. రాజు, "ఆగండి, ఆగండి! అతడు మహానుభావుడు," అని సైనికులను వారించాడు.

ఇంతలో దూరంగా పడిన కిరీటంలోనుంచి బుస్సున నాగుబాము ఒకటి లేచి బయటికి వచ్చింది. సైనికులు దాన్ని వెంటనే చంపేశారు. కొలువులో



పండిత జవహర్‌లాల్ నెహ్రూ
(మన భారతదేశపు ప్రధాన మంత్రి)



వున్న వాళ్లంతా మనోహరాన్ని మెచ్చుకొన్నారు.

ఈ సంగతి వినగానే రాజకుమారికి మనోహరంపై ప్రేమ యింకా ఎక్కువైంది. రాజు కూడా త్వరలోనే వాళ్ళిద్దరికీ పెండ్లి చేయాలనుకొన్నాడు.

మరునాడు అర్ధరాత్రి మనోహరం లేచి రాజుగారి పడకటింటికి బయలుదేరిపోతుంటే సైనికులు చాటుగా అతనివెంట బయలుదేరారు. అతడు తిన్నగ గదిలోకి వెళ్ళి రాజునూ రాణినీ జుట్టు పట్టుకొని మంచాలమీద నుంచి బయటి కీడ్చుకొచ్చాడు. సైనికులు మండిపడి అతని తల నరకటానికి కత్తులెత్తారు. రాజు వెనుకటిసారిలాగానే వాళ్లను వారించాడు. ఈలోపున ఆ గది కప్పు ఒక్కసారిగా కూలి ఊరుకున్నది.



ఈ వార్త పట్టణమంతా వ్యాపించింది. మనోహరం మహానుభావుడంటే మహానుభావుడని ప్రజలు మెచ్చుకొన్నారు.

ఆ మరునాడు రాజు మందిమార్బలంతో వేటకు వెళ్లాడు. జంతువులను వేటాడి వేటాడి రాజు అలసిపోయి ఒక చెట్టుక్రింద చతికిలబడ్డాడు. చెట్టుమీద గండభేరుండ పక్షి త్రాచుపామును పొడిచీతింటూవుంటే పాము నోటివెంట గరళంజారి రాజు గొంతుమీద పడింది. మనోహరం కత్తికొనతో గరళపు బిందువును

గిరివేశాడు. కొంచెం దూరంలోఉన్న సైని కులు మనోహరం రాజును చంపుతున్నా డనుకొని ఒక్కసారిగా అతన్ని చుట్టు ముట్టారు. రాజు జరిగిన సంగతంతా చెప్పి "అతను మహానుభావుడు. అతన్ని ఏమీ చేయకండి" అని వాళ్ళని మందలించాడు.

రాజు ఆనాడు సాయంకాలమే యింటికి వచ్చి తన కూతురును మనోహరునికిచ్చి పెండ్లి చేయటానికి నిశ్చయించాడు. పురోహితులు ముహూర్తం పెట్టారు.



పెళ్లి నాటి క్రిందటిరాత్రి లక్ష్మి మనోహరానికి ప్రత్యక్షమై "నేను వెళ్ళి పోతున్నాను" అని చెప్పి పోయింది. అతనికి ఏమీ తోచ లేదు. ఎక్కడలేని భయం కలి గింది. రాజు ఆస్థానంలో ఉంటే ఎప్పుడు ప్రాణాల మీదికి వస్తుందో నని జంకు బయలు దేరింది. అతడు వెంటనే మోహనవల్లి మెడలోని నగ లను ఆమెకు తెలియకుండానే తీసి మూటకట్టుకొని ఆ రాత్రే పారిపోయాడు.

తరువాత కొంతసేపటికి రాజకుమారి, రాణి, రాజు, పరి చారికలు మేలుకొని మనోహరం కోసం వెదికారు. రాజకుమారి దుఃఖానికిమితిలేకుండాపోయింది. సైనికులు వెంటనే గుర్రాలమీద మనోహరంకోసం వెదుకుతూ నలుదిక్కులకూ బయలుదేరారు.

అప్పుడు సరస్వతి లక్ష్మిని చూచి "నమ్మినవాణ్ణే యిలా





నట్టేట్లో ముంచుతావా? ఇది న్యాయమా?" అని అడిగింది.

లక్ష్మి నవ్వుతూ "నేను వాడి దగ్గర ఎప్పుడూ ఎందుకు ఉండాలి? వాడితిప్పలు వాణ్ణి పడనీ. లేదా నీచేతనైతే ఏమన్నా సహాయం చెయ్యి చూదాము," అన్నది.

సరస్వతి నేరుగా వెళ్లి వెనుకటి పూరిగుడిసెలో ఉన్న మనోహరాన్ని ఆవేశించింది. ఇంతలో రాజు సైనికులతో గుడిసెదగ్గరకు వచ్చాడు. అప్పుడు మనోహరం ఆశ్చర్యంతో "ఎందుకు ఇంత దుంపలు దంపలు చేసుకొని వచ్చారు? నేను రేపు ప్రొద్దుటికి రాకపోయానా?" అన్నాడు.

"రేపువచ్చేవాడివి ఈనగలు ఎందుకు తెచ్చావు?" అని అడిగాడు రాజు.

"పెండ్లి రేపు జరుగుతుం దనగా ఈరాత్రి పెండ్లికూతురు నగలు ఎత్తుకొనిపోవాలి. ఇది మా కులాచారం," అన్నాడు మనోహరం.

రాజు సంతోషించి అతన్ని వెంటబెట్టుకొని వెళ్లి శుభముహూర్తాన తన కూతుర్నిచ్చి పెండ్లిచేశాడు.

జానకి ఈ కథంతాచెప్పి "ఎప్పుడైనా లక్ష్మి ఒకచోట ఉండేదికాదు. దాన్ని నమ్మటానికి వీలులేదు. మానవుడికి సహాయంచేసి ఆదుకొనేది సరస్వతే కాని లక్ష్మికాదు. ఏమంటావు?" అని చెల్లెల్ని అడిగింది. వసంత అక్క చెప్పినట్లు ఒప్పుకొన్నది.



# మంచివంకాయ! పాడువంకాయ!!

**అనగా** అనగా ఒక నవాబు. ఆ నవాబు గారిని దర్శించటానికి రోజూ గొప్పవాళ్ళు వస్తూంటారు. ఇట్లా వచ్చినవాళ్ళు నవాబు గారికి నజరానా లిచ్చుకోవాలి. నజరానాల కింద నవాబుగారికి అనేక వస్తువులు వస్తూఉంటాయి.

ఒకనాడు నవాబుగారి కెవరో వంగ దేశంనుంచి వచ్చిన ఒక కొత్తరకం కూర నజరానా ఇచ్చారు. ఆ వంగకాయలను వంటవాడు మసాళాపెట్టి వేయించి బహు రుచికరంగా వండాడు. నవాబుగారు ఆ కూరతిని "బహుత్ అచ్ఛా!" అన్నారు. వంకాయగురించి నవాబుగారు చాలా గొప్పగా మాట్లాడసాగారు.

నవాబుగారికి వంకాయను గురించి ఇంకా వివరాలు తెలుసుకో బుద్ధిపుట్టింది. మంత్రిని పిలిచి ఒక వంకాయ తెప్పించ మన్నారు. మంత్రి తెప్పించాడు. నవాబు గారు దాన్ని సంతోషంతో చూస్తూ, "అల్లా దీనికెంత రుచిపెట్టాడోయ్! ఇంతకన్న రుచిగలకూర ప్రపంచంలో ఉందా?" అని అడిగాడు.

"లేదు, సర్కార్!. ఇదే అన్నికూరలకీ రాజు! దాని నెత్తిమీద అందుకే దేవుడు కిరీటం వుంచాడు," అన్నాడు మంత్రి.

మంత్రి ఈమాట అనటం పూర్తి అయిందో లేదో, ఇంతలోనే, వంగతొడిమ పరీక్షిస్తున్న నవాబుగారి చేతికి చిన్నముల్లు గుచ్చుకుంది.

నవాబుగారు తేలుకుట్టినట్టు లేచి వంకాయ అవతలపారేసి, "అరే, మంత్రీ! ఈ వెధవ వంకాయా కూరలకి రాజు? చూడు దీనిముల్లు నాచేతిలో ఎట్లా గుచ్చుకుందో?" అన్నారు.

"అవును, సర్కార్! ఇది వొట్టి వెధవ కూర! అందుచేతనే దేవుడు దీని నెత్తిన డిప్పపెట్టి తలలో మేకు దిగగొట్టాడు. కావలిస్తే మీరే పరీక్షించండి. ఈ మేకు పీకినారాదు?" అంటూ మంత్రి నవాబుగారికి వంకాయతొడిమ లాగి చూపించాడు.

"అచ్ఛా, మంత్రీ! ఇక ఎప్పుడూ ఈ వెధవకూర మన అస్థానంలో వండ నివ్వకు!" అన్నాడు నవాబుగారు.

రచన: ముసలాడు



# గారడీ అద్దం

అనగా అనగా ఒక నవాబుండేవాడు. అతనికి ధనానికిగానీ, ఏనుగులూ, గుఱ్ఱాలూ, ఒంటెలూ, సైన్యానికిగానీ తరుగులేదు. మంచి పరాక్రమశాలి. అయితే అతనికి ఒకే దిగులు ఉంది.

అతను చిన్నతనంలో చాలా బీదవాడు. అతనికి చిన్న గుడిసె, తల్లీ తప్ప ఎవ్వరూ లేరు. పొట్టకోసం ఇంటినీ తల్లినీ వదిలి సైన్యంలో సిపాయిగా చేరాడు. క్రమంగా అతను సర్దారూ, సుబేదారూ, సేనానాయకుడూ అయి ఆఖరికి నవాబును చంపి తానే నవాబు అయాడు. ఇప్పుడతనికి బీదవాళ్లంటే తగనిమంట. అడుక్కోటానికి ఎవరన్నా వస్తే వాళ్లని చంపివేయమని ఉత్తరవు చేశాడు.

ఒక రోజున నవాబును చూడటానికి ఒక ఫకీరు వచ్చాడు. నవాబుగారిని చూడాలని కబురు చేశాడు. నవాబుకు కోపంవచ్చింది.

“వాణ్ణి చంపకుండా ఎందుకుంచారు?” అని బంట్రోతు నడిగాడు.

“చిత్తం! వాడు బిచ్చానికి రాలేదు. తమ కేవో వస్తువు లమ్మాలట.” అన్నాడు బంట్రోతు.

“అయితే తీసుకురావాణ్ణి” అన్నాడు నవాబు. ఫకీరు వచ్చాడు.

“ఎందు కొచ్చావు?” అన్నాడు నవాబు.

“చిత్తం. తమకు ముందే కబురు చేశాను.” అన్నాడు ఫకీరు.





"నేనిప్పుడే ప్రపంచానికి అధిపతిని" అన్నాడు నవాబు.

ఫకీరు సంచిలోనించి ఒక పొట్లంతీసి. "హుజూర్! ఈ పొడి తిన్నవారికి ప్రపంచంలోకెల్లా చక్కని స్త్రీ భార్యగా దొరుకుతుంది." అన్నాడు.

"ఇప్పుడు నాభార్యే ప్రపంలోకెల్లా చక్కనిది!" అన్నాడు నవాబు.

ఫకీరు సంచిలోనించి ఈమాటు ఒక చిన్న అద్దం బయటికి తీసి "హుజూర్! ఈ అద్దం ఎవరి ముఖంముందు పెట్టినా వాళ్ల మనసులో సంగతులన్నీ తెలుస్తయి." అన్నాడు.

"అది నిజమని నమ్మటం ఎట్లా?" అన్నాడు నవాబు.

"నమ్మటం సంగతి తర్వాత. ముందు ఈ అద్దంలో చూడాలికదా," అన్నాడు ఫకీరు.

"ఐతే దాని ధరచెప్పు?" అన్నాడు నవాబు.

"హుజూర్! మీరు కోపగించుకోకుండా ఉంటే దాని ధర చెపుతాను." అన్నాడు ఫకీరు.

"అయితే నీ వస్తువులు తీయి." అన్నాడు నవాబు.

"చిత్తం! ఇంతమందిలో చూపటం బాగుండదు." అన్నాడు ఫకీరు.

నవాబు దర్బారులో ఉన్నవాళ్లనందరినీ పంపించేశాడు. ఫకీరు తన సంచిలోంచి ఒక మాత్ర తీసి "హుజూర్! ఈ మాత్ర తిన్నవాళ్ళు ప్రపంచానికంతా అధిపతులౌతారు" అన్నాడు.



"చెప్పు. కోపం ఎందుకు?" అన్నాడు నవాబు.

"అయితే దీని ధర మీ రాజ్యం యావత్తూ. ఇది మీరు తీసుకుంటే మీ సింహాసనం నాకిచ్చి, నా గుడ్డలు మీరు వేసుకుని వెళ్ళవలసి ఉంటుంది." అన్నాడు ఫకీరు.

నవాబు కొంచెంసేపు ఆలోచించి సింహాసనం దిగివచ్చి తన దుస్తులు ఫకీరుకిచ్చి ఫకీరు గుడ్డలు తను వేసుకుని అద్దం తీసుకున్నాడు.

మంత్రీ సేనానాయకుడూ అప్పుడు పక్క గదిలో నవాబుగారి పిలుపుకోసం ఎదురు చూస్తున్నారు. నవాబు వాళ్ళ గదిలోకి వెళ్ళాడు. మంత్రి మొదలైన వాళ్లు నవాబుగారు ఫకీరు దుస్తులతో రావటంచూచి ఆశ్చర్యపోయారు.

నవాబు అద్దం తీసుకుపోయి మంత్రి ముఖం ముందు పెట్టాడు.

చిత్రమేమంటే పైకి ఎంత నక్క వినయంచూపినా మంత్రికి నవాబుమీద పీసంకూడా గౌరవంలేదు. నవాబును చంపి తను నవాబు కావాలని సేనానాయకుడితో కుట్ర పన్నుతున్నాడు.



నవాబుకు వాళ్ల మీద ఎంతో కోపం వచ్చింది. అయితే అది అంతా దిగమింగి అంతఃపురంలోకి వెళ్లాడు.

అతనిభార్య చెలికత్తెలతో కూర్చుని ఉంది. చెలికత్తెలు నవాబును చూడగానే వెళ్లిపోయారు. నవాబు అద్దం తీసుకెళ్లి భార్య ముఖందగ్గర పెట్టాడు.

గమ్మత్తేమిటంటే అతని భార్యకు అతనిమీద ప్రేమలేదు. ఇన్నాళ్లనించీ ఆమె చూపుతున్నది దొంగప్రేమ.

నవాబు అక్కడినించి వెళ్లి తన కొడుకుల మొఖానా, తన చుట్టాల మొఖానా అద్దం పెట్టిచూశాడు. ఒక్కరూ అతన్ని నిజంగా ప్రేమించటంలేదు.

అతనికి ప్రపంచంమీదనే విసుగు వేసింది. రాజ్యం ఫకీరుకు ఇవ్వనే

ఇచ్చాడు. ఇక ఆతను ఫకీరు కావటానికి అడ్డేమీలేదు.

నవాబు రాజధాని వదిలి అరణ్యాలగుండా తను పుట్టిన ఊరు చేరుకున్నాడు. అప్పటికి కనుచీకటి పడింది. తన గుడిసె వెతుక్కొని లోపలికి వెళ్లాడు.

నవాబు తల్లి మంచంమీద చావటానికి సిద్ధంగా ఉంది. ఆమె చిన్న గొంతుతో "నాయనా! నాతండ్రీ!" అని పిలుస్తూ ఉంది.

నవాబు తల్లిదగ్గరికిపోయి అద్దం ముఖం దగ్గరపెట్టాడు. ఆమె ప్రేమలో కల్మషం ఏమీలేదు; స్వార్థం ఏమీలేదు. నవాబు ఇప్పుడు భూలోకమంతా ఏలే నవాబుకాడు. అన్నీ వదిలి నిజమైన ప్రేమకోసం పరితపిస్తున్న సన్యాసి. నవాబు చిన్నపిల్లవాడిలాగా ఏడుస్తూ "అమ్మా! అమ్మా!" అని పిలిచాడు.

చావటానికి సిద్ధంగాఉన్న నవాబు తల్లి కళ్ళు తెరిచింది. ఆమె కళ్లల్లో ముత్యాలలాగా రెండు నీటి చుక్కలున్నాయి. ఆనందంతో మళ్లీ ఆమె కళ్ళు మూసింది. అంతే, మళ్లీ ఆమె కళ్ళు తెరవలేదు. నవాబు మళ్లీ తన రాజ్యానికి పోలేదు. బైరాగిలాగా దేశమంతా తిరుగుతున్నాడు.






ఒకవూళ్లో గజకర్ణ అనే గజదొంగ వుండేవాడు. ఆ పక్కవూళ్లోనే గోకర్ణ అని మరో దొంగ వుండేవాడు. వీళ్లిద్దరూ ఒకడిని మించినవాడు యింకొకడు.

ఒకరోజున వీళ్లిద్దరూ ఒకచోట కలుసుకున్నారు. గజకర్ణ ఎవరో గోకర్ణకు తెలియదు, గోకర్ణ ఎవరో గజకర్ణకు తెలియదు. అయినా, యిద్దరూ దొంగలు కనక, ఒకడి దగ్గిర డబ్బు యింకోడు కాజెయ్యాలని, "ఓహో, బావా!" అంటే "ఓహో, బావా!" అని పలకరించుకున్నారు. గోకర్ణ దగ్గిరవున్న డబ్బు కాజెయ్యాలని, ఆ రాత్రికి అతన్ని తనయింటికి భోజనానికి పిల్చాడు, గజకర్ణ

పిండివంటలూ అవీ చేయించి, గజకర్ణ అదివరకు తను దొంగిలించిన బంగారం పళ్లెంలో గోకర్ణకు భోజనం పెట్టించాడు. భోజనం చేస్తూండగా, గోకర్ణకు ఆ బంగారపు పళ్లెం ఎలాగైనా కాజెయ్యాలని ఆశ పుట్టింది. గజగర్ణమాత్రం ఏం తక్కువ తిన్నాడు గనకనా! "కంఠందాకా తిండి మెక్కిస్తే మత్తెక్కి నిద్రపోతాడు. అప్పుడు మనం వీడిదగ్గిర డబ్బు కాజెయ్యవచ్చు గదా" అనుకున్నాడు గజకర్ణ.

గోకర్ణ భోజనంచేసినతర్వాత దొంగనిద్రపోతూ పడుకున్నాడు. ఇదే సందుగదా అని, గజకర్ణ లేచివచ్చి గోకర్ణ మొలచుట్టూ తడివిచూశాడు, డబ్బుసంచికోసం. కాని, పాపం ఏమీ కనిపించలేదు. చేసేదిలేకపోయి పడుకున్నాడు.

దొంగనిద్రపోతున్న గోకర్ణ, గజకర్ణ నిద్రపోగానే పెట్టెతాళం వూడగొట్టి, బంగారపుపళ్లెం తెచ్చి తలకింద దాచుకుని పడుకున్నాడు. కొంతసేపటికి గజకర్ణకు మెళుకువవచ్చి తన పెట్టెవంక చూశాడు. తాళం వూడగొట్టి వుంది. గుట్టుచప్పుడు కాకుండా గోకర్ణ పక్క అంతా వెదికాడు. చివరికి తలక్రింద కనిపించింది బంగారపు పళ్లెం.

బొంతా లక్ష్మణరావు, శ్రీకాకుళం.



మెల్లిగా పళ్లెంనిండా నీళ్ళుపోసి, అ పళ్లెం వుట్టిమీద పెట్టి, వుట్టికింద తను మంచం వేసుకుని పడుకున్నాడు. "పళ్లెం కదిలిస్తే నీళ్లు మీదపడతాైగదా, అప్పుడు నాకు మెలుకువ వస్తుంది" అనుకున్నాడు, పాపం గజకర్ణ.

ఇదంతా దొంగనిద్రపోతున్న గోకర్ణ చూస్తూనేవున్నాడు. గజకర్ణని నిద్ర పోనిచ్చి, మెల్లిగా కచికలుతెచ్చి వుట్టిమీద పళ్లెంలో వెయ్యటం మొదలుపెట్టాడు. కాసేపటికి పళ్లెంలోవున్న నీళ్లన్నిటినీ కచికలు పీల్చివేసినై. అప్పుడు ఆ పళ్లెం తీసుకుపోయి ఒక చెరువులో దాచివచ్చి, ఏమీ ఎరగనివాడికిమల్లే పడుకున్నాడు.

ఇంతలోకే గజకర్ణకు మెలుకువ వచ్చింది. వుట్టివంక చూశాడు. పాపం, పళ్లెం కనిపించలేదు అయినా, వీడేం తక్కువ తిన్నాడుగనకనా! గోకర్ణదగ్గిరికిపోయి కాళ్లు పరీక్షగా చూశాడు. పాదాలమీద యిసక అక్కడక్కడా కనబడింది. ఇంకేం, 'వీడు పళ్లెం ఎక్కడో చెరువులో దాచివచ్చి వుండాలి' అనుకున్నాడు. అనుకున్నవాడు బయలుదేరాడా. అబ్బే, కాళ్లు నాకటం ప్రారంభించాడు. ఎందుకో తెలుసా? నీళ్లల్లో ఎంతలోతుకుపోయి దాచిపెట్టాడో తెలుసుకో టానికి. అలా కాళ్లు నాకుతూవుంటే



మోకాళ్లదాకా చప్పగానూ, ఆపైన ఉప్పగానూ ఉంది. కనక, 'తప్పకుండా మోకాటిలోతు నీళ్లలోకిపోయి పళ్లెం అక్కడ దాచివుంటాడు. అందుకనే మోకాళ్లవరకూ చప్పగా, ఆపైన ఉప్పగా వుంది,' అనుకున్నాడు అవూళ్లో వున్నది ఒక్కటే చెరువు. మోకాటి లోతు వరకూ పోయి వెతికితే దాంట్లో పళ్లెం దొరికింది. పళ్ళెం తీసుకుని గజకర్ణ యింటికి వస్తున్నాడు.

ఈలోపుగా గోకర్ణ లేచిచూస్తే గజకర్ణ కనిపించలేదు. 'వీడు మనల్ని మించిన వాడురా బాబూ, వీడితో పోటీకి పోవటం కంటే, మంచిచేసుకుని, భాగస్వామిగా చేరటం మంచిది' అనుకున్నాడు గోకర్ణ.

పళ్ళెం తీసుకుని గజకర్ణ యింటి గుమ్మం దగ్గిరికి రాగానే, గోకర్ణ ఎదురుగాపోయి—"బావా! ఏమో అనుకున్నానుగాని, నన్ను మించినవాడివే నువ్వుకూడా! ఇకనించి, మనమిద్దరం కలిసి వ్యాపారం సాగిద్దాం. మంచి లాభంకూడా వస్తుంది. వచ్చిం దాన్ని యిద్దరం సమంగా పంచుకుందాం" అన్నాడు గోకర్ణ. ఇందుకు గజకర్ణకూడా యిష్టపడ్డాడు.

మంచిరోజు చూచుకొని గజకర్ణ, గోకర్ణలు దొంగతనానికి బయలుదేరారు. దారిలో గోకర్ణ గజకర్ణతో "ఒరే, బావా! మావూళ్లో సుబ్బన్నశెట్టి చనిపోయాడట. వాడు మనకు వెయ్యిరూపాయలు బాకీ వున్నాడని, సెట్టి తమ్ముణ్ణీ, పెళ్లాన్నీ ఆ బాకీ తీర్చమని అడుగుదాం. వాళ్లు రుజువు అడుగుతారు. అప్పుడు మనం ఏమిచెబుదాము?" అని అడిగాడు.

"అదికూడా నువ్వేచెప్పు" అన్నాడు గజకర్ణ.

"అయితే, విను. శెట్టిని దహనంచేసిన చోటనే ఒక గొయ్యితీసి అందులో నిన్ను పూడ్చిపెడతాను. నీకు మాత్రం గాలి ఆడేట్టుగానే పూడ్చిపెడతానులే. తర్వాత నేను వెళ్లి శెట్టి పెళ్ళాం వాళ్లని డబ్బు అడుగుతాను. అప్పుడు వాళ్ళు 'నీకు బాకీ వున్నట్టు రుజువులేందే మేము ఎలానమ్ముతాం' అంటారు. 'కావల్సివస్తే శెట్టిగార్ని దహనంచేసినచోటికిపోయి శెట్టిని పిలుస్తాను. శెట్టిపలికితేనే నాకు డబ్బుయివ్వండి'అని వాళ్లని యిక్కడికి తీసుకొస్తాను. తీసుకొచ్చి 'ఓ సుబ్బన్న శెట్టి' అని పిలుస్తాను.









నువ్వు గోతిలోనించి 'ఓ' అని పలుకు. అప్పుడు 'నీవు నాకు వెయ్యి రూపాయలు బాకీవున్నావుగదా' అని అడుగుతాను. 'ఔను' అని పలుకు. నిజమేగదా అనుకుని వాళ్ళు వెయ్యి రూపాయలు యిస్తారు. ఇద్దరం పంచుకుందాం" అన్నాడు గోకర్ణ.

సరే, బాగుందంటే బాగుందనుకున్నారు తోడు దొంగలిద్దరూ. గజకర్ణని పూడ్చిపెట్టి గోకర్ణ శెట్టిగారింటికి వెళ్ళాడు. అనుకున్నట్టుగానే, 'ఋజువులేనిదే బాకీ తీర్చము' అన్నారు శెట్టి పెళ్ళాంవాళ్ళు. సరేనని, గోకర్ణ వాళ్ళని తీసుకుని గజకర్ణని పూడ్చిపెట్టిన చోటికివచ్చి, 'ఓ సుబ్బన్నశెట్టీ' అని పిలిచాడు. 'ఓ' అని పలికాడు గజకర్ణ గోతిలోంచి.

"సుబ్బన్నశెట్టీ! నీవు నాకు వెయ్యిరూపాయలు బాకీవున్నావు కదా?" అని తిరిగి అడిగాడు గోకర్ణ.

"అవును" అని పలికాడు గజకర్ణ గోతిలోనించి.

పాపం, శెట్టి పెళ్ళాంవాళ్లూ నిజమేగదా అనుకుని, గోకర్ణని తీసుకెళ్లి వెయ్యిరూపాయలు దర్శించుకుని పంపారు.

గోకర్ణ తిరిగివచ్చి, గజకర్ణని పూడ్చిపెట్టిన గోతిమీద పెద్ద బండపెట్టి వెయ్యి రూపాయలు తీసుకుని వుడాయించాడు.

"బావా, బావా!' అని కేక వేశాడు గోతిలోనించి గజకర్ణ. ఇంకెక్కడిబావ! అప్పుడె అర మైలుదూరం వెళ్ళిపోయాడు.

ఎలాగో తిప్పలుపడి గజకర్ణ యింకో కన్నం చేసుకుని కొంత సేపటికి గోతిలోనించి బయట బడ్డాడు గోకర్ణచేసిన మోసానికి బదులు తీర్చుకోవాలని నిశ్చయించుకున్నాడు.



స్మశానంనించి వూరిబయటికిపోయేత్రోవ ఒకటే వున్నది. ఆ త్రోవనే బయలుదేరాడు గజకర్ణ, గోకర్ణని వెతుక్కుంటూ.

వెయ్యి రూయిపాలు ఒక్కడే ఎలా మోస్తాడూ? అందుకని గోకర్ణ ఒక యెద్దుని కొని దానిమీద రూపాయలమూట వేసుకుని పోతూవున్నాడు.

అంత దూరాన పోతూవున్న గోకర్ణని గజకర్ణ దూరాన్నించి చూశాడు. పొలాల్లో గుండా నక్కి-నక్కి పోయి ఎలాగైతేనేం గోకర్ణకంటే ముందుగా చేరుకున్నాడు. గజకర్ణదగ్గర ఎక్కడో కాజేసిన ఒక చక్కటి చెప్పులజత కొత్తది వున్నది. వాటిలో ఒకచెప్పుని గోకర్ణవచ్చేదారిలో పడేసి మళ్లీ పొలాల్లో దాక్కుని చూస్తున్నాడు.

కొంతసేపటికి గోకర్ణవస్తూ ఆ చెప్పు చూశాడు. "ఈ ఒంటి చెప్పు తీసుకెళ్లి నేనేం చేసుకుంటాలె" అనుకుని చెప్పు తీసుకోకుండానే వెళ్లిపోతున్నాడు.

పొలాల్లోంచి గజకర్ణ ఈ మాటలు విన్నాడు. మళ్ళీ అలాగే నక్కుతూపోయి గోకర్ణకంటె ముందుగాచేరి రెండో చెప్పు కూడా గోకర్ణవచ్చే దారిలో పడేసి దాక్కుని చూస్తున్నాడు.

కొంతసేపటికి గోకర్ణవస్తూ యీ చెప్పు చూచి, "ఒంటి చెప్పు అనుకున్నాను. రెండోదికూడా దొరికింది. పోయి మొదటిది కూడా తెచ్చుకుంటాను" అనుకుని ఎద్దుని ఒక చెట్టుకు కట్టేసి మొదటి చెప్పు తెచ్చుకోటానికి వెనక్కి వెళ్లాడు.

గోకర్ణ అటుపోగానే గజకర్ణ మెల్లిగా పొలాల్లోంచి వచ్చి చెట్టుకుకట్టిన ఎద్దుని రూపాయల మూటతో గబగబా తోలుకు పోయాడు. కొంతదూరం పోయిన తర్వాత ఎద్దుని వదిలిపెట్టి, రూపాయల మూటతో ఒక గడ్డివామిలో దాక్కుని కూర్చున్నాడు.

గోకర్ణ తిరిగివచ్చి చూచుకుంటే, పాపం ఎద్దూలేదు, రూపాయలమూటా లేదు. తప్ప కుండా యిది మనవాడి పనే అయివుం టుంది అనుకుని ఆ దోవనే దిక్కులు చూసుకుంటూ వస్తున్నాడు. దోవలో గడ్డి వామి కనిపించింది. "గడ్డివామి తప్ప దాక్కోటానికి యిక్కడ యింకా ఏమీలేవు. తప్పకుండా యిందులోనే వుండాలి" అను కొని గడ్డివామిలోంచి ఒక్కొక్క పరకా లాగటం మొదలుపెట్టాడు.

"చిక్కిపోయానురా బాబూ" అంటూ వామిలోనించి గజకర్ణ బైటబడ్డాడు.

"మనిద్దరిమధ్యా పేచీలు దేనికి. ఈ రూపాయలు యిద్దరం సమంగా పంచు కుందాం" అన్నాడు గోకర్ణ.

సరేనంటే సరే ననుకుని అలాగే పంచు కుని మళ్ళీ మామూలుగా యిళ్లకు చేరు కున్నారు, ఆ తోడుదొంగలిద్దరూ.




వెనకటికి ఒక విద్యావంతుడైన బ్రాహ్మ డుండేవాడు. ఆయనదగ్గిర ఒక శిష్యు డుండేవాడు. ఈ శిష్యుడు చాలా చురుకైనవాడు. గురువుదగ్గిర సకలవిద్యలూ నేర్చుకోవటమే కాక, గురువుగారు తరుచు తీర్థయాత్రలకు వెళ్లినప్పుడు వారి కుటుంబాన్ని కనిపెట్టుకొని ఉండేవాడు.

ఇట్లా ఉండగా గురువుగారి భార్య గర్భిణిగా ఉండి ప్రసవం అవుతున్నది. ఇరుగు పొరుగు అమ్మలక్కలు పురుడు పోస్తున్నారు. శిష్యుడు పురిటిగది బయట కూచున్నాడు.

ఇంతలో అక్కడికి బ్రహ్మదేవుడు వచ్చి పురిటిగదిలోకి వెళ్లబోయినాడు. ఎవరికీ కనిపించని బ్రహ్మను శిష్యుడు చూడగలిగాడు కాని గుర్తించలేదు.

"ఎవరునువ్వు? లోపలికి వెళ్లటానికి వీల్లేదు. లోపల మా గురువుగారి భార్య ప్రసవిస్తోంది," అన్నాడు శిష్యుడు.

"అందుకనే నేను లోపలికి వెళుతున్నాను. భూమిమీద పడకముందే నేను ఆ బిడ్డ నొసట వ్రాతవ్రాయాలి. నేను బ్రహ్మను," అన్నాడు బ్రహ్మ.

"ఏమని వ్రాస్తావు? చెబితేగాని లోపలికి పోనివ్వను. నువు బ్రహ్మవయితే నాకేక్కువ లేదు," అన్నాడు శిష్యుడు.

"నాకు నీతోమాట్లాడే వ్యవధిలేదు. అదీకాక నావ్రాత ఎవరికీ ముందుగా తెలియకూడదు," అన్నాడు బ్రహ్మ.

"అయితే నువు లోపలికి వెళ్లటానికి వీల్లేదు," అన్నాడు శిష్యుడు మొండిగా.

"ఏమివ్రాస్తానో నీకు చెప్పగలను గాని నువు మళ్లీ ఎవరికైనా చెబితే తలపగిలి చస్తావు!" అని బ్రహ్మ శిష్యుణ్ణి భయపెట్టాడు.

"నా కడంతా తెలీదు. నువ్వు వ్రాసేవ్రాత ఏమిటో చెప్పి మరీ లోపలికివెళ్లు," అన్నాడు శిష్యుడు.

"అయితే విను ఈసంగతి ఎవరికన్నా చెప్పావా నీ తల బ్రద్దలవుతుంది. మీ గురువుగారి భార్యకు మగపిల్లవాడు పుట్టబోతున్నాడు. బతికిఉన్నంత కాలమూ



వాడికి మూలెడు ధాన్యమూ, ఒక ఆవూ మాత్రమే ఉంటాయి," అన్నాడు బ్రహ్మ.

"అంత దరిద్రమా? ఒకరికి పెట్టుకునేటందుకూ చేసుకునేటందుకూ కూడా లేదా?" అన్నాడు శిష్యుడు.

"చేసుకున్నవారికి చేసుకున్నంత! నేనేంచెయ్యను?" అన్నాడు బ్రహ్మ.

"పోనీ అవయినా తియ్యకుండగా ఉంటాయా?" అన్నాడు శిష్యుడు.

"తియ్యకుండా ఉంటాయి," అంటూ బ్రహ్మ పురిటిగదిలోకి వెళ్ళాడు. మరి కాస్సేపటికి పురిటిగదిలోనుంచి పుట్టిన పిల్లవాడి ఏడుపు వినిపించింది.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. గురువుగారి భార్య మళ్ళీ కనటానికి సిద్ధంగా ఉంది. గురువుగారు ఎప్పటిలాగే తీర్థయాత్రలు చేస్తున్నాడు. శిష్యుడుమటుకు యథాప్రకారం పురిటిగది ఎదుట కాపలా ఉన్నాడు.

మళ్లీ బ్రహ్మదేవుడు వచ్చాడు. శిష్యుణ్ణి చూశాడు. "నువింకా ఇక్కడే ఉన్నావా?" అన్నాడు.

"ఉన్నాను, స్వామీ! ఈసారి ఏంపిల్ల? మీరేమివ్రాత వ్రాయబోతున్నారు?" అని అడిగాడు శిష్యుడు.

"అవంతా నీ కనవసరం. నన్ను లోపలికిపోనీ," అన్నాడు బ్రహ్మ.

"చెప్పందే లోపలికి పోవటానికి వీల్లేదు" అన్నాడు శిష్యుడు.

చేసేదిలేక బ్రహ్మ చెప్పేశాడు.

"ఈసారి ఆడపిల్ల. దానికి పెళ్ళిగీత లేదు. రోజూ ఏదో ఒక పెళ్లిసంబంధం మాత్రం వచ్చి తిరిగి పోతూవుంటుంది," అన్నాడు బ్రహ్మ.

శిష్యుడికి చెప్పరానికోపంవచ్చింది. కాని ఏంచేస్తాడు? బ్రహ్మవ్రాతకు అడ్డం ఏముందీ?

"ఈసంగతి ఎవరితోనైనా చెబితివా నీతల పేలిపోతుంది," అంటూ బ్రహ్మ పురిటిగదిలోకి వెళ్ళాడు.

అదిజరిగిన కొద్దికాలానికే శిష్యుడు గురువుగారివద్ద చదువు పూర్తిచేసి, స్వగ్రామానికివెళ్ళి, పెళ్లిచేసుకుని ఒక ఇంటివాడయినాడు.

కొద్ది సంవత్సరాలు గడిచాయి.

శిష్యుడికి ఎప్పుడూ తన గురువుగారి పిల్లలకు బ్రహ్మవ్రాసిన వ్రాతే జ్ఞాపకం వస్తూవుండేది. దానికేదైనా ప్రతిక్రియలేదా అని ఆలోచిస్తూ ఉండేవాడు. కాని బ్రహ్మవ్రాతకు తిరుగువెయ్యటం ఎట్లా? ఆవ్రాత ప్రకారం జరిగితే, పాపం, ఆ యిద్దరు పిల్లలూ నిష్కారణంగా చెడిపోతారే అని శిష్యుడు ఎప్పుడూ విచారిస్తూండేవాడు. ఇట్లా విచారిస్తూపోగా శిష్యుడికొక గొప్ప ఆలోచన తట్టింది. అతను వెంటనే గురువుగారి గ్రామానికి ప్రయాణంకట్టాడు.





గురువుగారూ, ఆయనభార్యా చనిపోయి కొద్దికాలమయింది. గురువుగారి అబ్బాయికి వివాహమయింది. అతను పౌరోహిత్యం చేస్తూ, పొలంచూసుకుంటున్నాడు. ఎంత కష్టపడి పనిచేసి ఎంత సంపాదించినా బ్రహ్మవ్రాతప్రకారం అతనికి దొడ్లో ఒక ఆవూ, ఇంటో మూలెడుగింజలూ తప్ప మరేమీ మిగలటంలేదు.

గురువుగారి పిల్లకు యుక్తవయస్సు వచ్చింది కాని ఆమెకింకా సంబంధం కుదరలేదు. ఎంతమందోవచ్చి చూసిపోతారు కాని ఒక్కరూ పెండ్లాడరు. ఆ పిల్లకు పెళ్లికానందుకు వదినె రోజూ ఆ పిల్లను తిట్టుతున్నది. ఆపిల్లకు ఆయింట్లో ఉండడం కష్టంగా ఉంది.

శిష్యుడు ఆ ఇద్దరికీ తాను ఆలోచించిన సలహాలు చెప్పేశాడు. గురువుగారి కొడుకుతో ఈవిధంగా చెప్పాడు:



"నువు డబ్బుకేమీ విచారించకు. నీ దారిద్ర్యంచూసి భయపడకు. నీదగ్గర ఉన్న గింజలుపెట్టి సరిపోయినంత మందికి సంతర్పణచేసెయ్యి. సాయంకాలం అయేసరికి ఇంటో ఒక్క గింజ మిగల్చకు. దొడ్లో ఆవునుకూడా ఉంచకు. ఎవరికైనా విక్రయించు. అమ్ముడుపోకపోతే దానం చేసెయ్యి. నీకేమీ నష్టం ఉండదు".

దానికి గురువుకొడుకు భయపడి, "అసలే నాది బీదసంసారం. ఇట్లా చేస్తే నేనూ నా భార్యా మాడి చచ్చిపోమా?" అన్నాడు.

"నామాటనమ్మి నేను చెప్పినట్టుచెయ్యి. చాతనయితే రోజూ నేను చెప్పినట్టేచెయ్యి. నీకేమీ నష్టం కలగకుండా నేనుచూస్తాను. కావలిస్తే నేను నీయింటో కొంతకాలం ఉండి నామాట రుజావుచేస్తాను," అన్నాడు శిష్యుడు.

శిష్యుడిమాట నమ్మి ఆరోజుకు కావలిసిన గింజలుమాత్రం ఉంచుకుని మిగతావి వండించి గురువు కొడుకు నలుగుర్నీ పిలిచి భోజనాలు పెట్టాడు. ఎన్నడూ పిల్లికి బిచ్చంవేసే స్థితిలో లేనివాడు సంతర్పణ చేస్తున్నాడంటే అందరికీ ఆశ్చర్యంగానే వుంది.

ఆరోజు సాయంకాలం అవును బజారుకు పట్టుకెళ్లి గురువుగారి అబ్బాయి దాన్ని అమ్మేసి ఆ డబ్బుతో తనకూ భార్యకూ కావలిసిన వస్తువులన్నీ కొనుక్కున్నాడు.





మర్నాడు పొద్దుటికల్లా గురువుగారి కొడుక్కి కబురువచ్చింది. ఆ వూళ్ళో ఒక పెద్ద భాగ్యవంతుడు చచ్చిపోయాడు. ఆయనకు చినకర్మ చేయాలట. గురువుగారి కొడుకు వెళ్ళాడు. ఆయనకు ఒకమూట బియ్యమూ, ఒక గోవు దానమూ దొరికింది.

ఆ సాయంత్రం అతను బియ్యం పంచి పెట్టి, ఆవును అమ్మివేశాడు. మర్నాటి ఉదయానికి ఇంకొక కబురు. ఒక ముసలమ్మ చచ్చిపోయిందని. వాళ్లు కూడా గురువుగారి అబ్బాయికి ఒకమూటెడు బియ్యమూ, గోదానమూ ఇచ్చారు.

ఇలా చావులతో కొన్నాళ్లు గడిచింది. ఆ తర్వాత ఒకరోజున ఎవరూ చావలేదు. కాని మధ్యాన్నమయేవరకు దొడ్లో ఒక ఆవు కట్టేసివుంది. ఇంటో ఒక బియ్యంమూట వుంది. గురువుగారి అబ్బాయికి ఆనాటినించి ఇల్లు కదలకుండానే బియ్యపుమూటా ఆవూ దొరుకుతున్నాయి.

శిష్యుడు గురువు కొడుక్కు సలహా ఇచ్చినట్టుగానే గురువు కూతురుకుకూడా సలహా ఇచ్చాడు.

"అమ్మా! నీకు పెళ్లికాలేదని దిగులు పడుకు. నేను చెప్పినట్టుగాచెయ్యి. నీకు లక్షణమైన మొగుడు దొరుకుతాడు. ఇకనించి నిన్ను చూడవచ్చేవారు ఉత్త చేతులతోవస్తే కనపడవద్దు. ఒక పట్టుచీరె, పట్టురవికె, బంగారపు వొడ్డాణమూ, కంటే, నాగరమూ, పసుపూ కుంకుమా తెస్తేనే కనపడతానను!"

ఈమాట వినగానే ఆ అమ్మాయికి మరీ దిగులువేసింది. "నన్ను ఊరకనేకూడా



చేసుకోనివారు ఇంతడబ్బు ఖర్చుపెట్టి చూడటానికివస్తారా?" అని అడిగింది.

"వస్తారమ్మా, వస్తారు! నామాటవిని నాలుగురోజులలా చెయ్యి" అన్నాడు శిష్యుడు.

మర్నాడు ఆ అమ్మాయిని చూడటానికి ఒక సంబంధం వచ్చింది. ఆ అమ్మాయి ఒకచీరె, రవికె, వొడ్డాణమూ, కంటే, నాగరమూ, పసుపూ కుంకుమా తెస్తేనేగాని కనపడనని కబురుచేసింది.

ఆవచ్చిన సంబంధంవాళ్లు అవే పోకపోయారు. సాయంత్రంవరకు మళ్లీ ఎవ్వరూ రాలేదు. సాయంత్రం ఒక పెద్ద మనిషి ఆ పిల్లకోరిన వస్తువులన్నీ తీసుకుని వచ్చాడు. అవి ఆ పిల్లకుయిచ్చి ఆమెను చూసి వెళ్ళాడు.



ఇలా రోజూ ఆ పెద్ద మనిషే వచ్చి చీరెలూ, నగలూ యిచ్చి పిల్లను చూసి పోతున్నాడు. గురువుగారి అమ్మాయికూడా ఇక పెళ్లికాలేదని దిగులుపడలేదు; ఆపిల్ల పదినె రోజూదొరికే నగలూ, నాణాలూ ఇంటో వేసుకుని ముడుసుకొంటున్నది.

శిష్యుడు ఒక నెలరోజులున్నాడు. అతని సలహాప్రకారం చెయ్యటంవల్ల తన గురువుగారి పిల్లలిద్దరి సమస్యలూ పరిష్కారం అయి, వాళ్ల యిద్దరి జీవితాలు ఒక ఒడ్డున పడ్డాయి. వాళ్లిద్దరి దగ్గిరా సెలవుపుచ్చుకుని శిష్యుడు తొలికోడి కూసే వేళకు బయలుదేరి తన స్వగ్రామానికి ప్రయాణమైనాడు. తెల్లవారటానికింకా రెండుగంటలున్నది. కాని వెన్నెలవుండటం వల్ల దారి చక్కగా తెలుస్తున్నది.

శిష్యుడికి దారిలో ఒక పెద్దమనిషి ఎదురైనాడు. ఒక భుజాన పెద్ద బియ్యం మూటా, రెండోచేతిలో నగలమూటా పట్టుకున్నాడు. ఒక అవును పలుపుకుకట్టి తెస్తున్నాడు. ఆ వచ్చేది బ్రహ్మదేవుడేనని శిష్యుడుగ్రహించి, 'నమస్కారం, స్వామీ!' అని పలకరించాడు.

"నీమూలంగా నాకెన్నిపాట్లు వచ్చాయో చూడు!" అన్నాడు బ్రహ్మ.

"నన్నేంచేయమంటారు స్వామీ! వాళ్ల ఖర్మ వాళ్ళది!" అన్నాడు శిష్యుడు నవ్వుతూ.

"ఇది వాళ్లఖర్మ కాదోయి, నాఖర్మ. నాకు ఒక్కపనిచేసుకోటానికి తీరిక చిక్కటం లేదు." అన్నాడు బ్రహ్మదేవుడు.

"అలా అయితే ఆరాత కొంచెం చెరిపి వెయ్యకూడదూ?" అన్నాడు శిష్యుడు.

"చెరపటం ఎలాగ? కాని కొంచెం దిద్ది నాఖర్మ వదిలించుకుంటాను" అంటూ బ్రహ్మదేవుడు వెళ్లిపోయాడు.

ఆనాటినించీ గురువుగారి అబ్బాయి పట్టినదెల్లా బంగారమైంది. గురువుగారి అమ్మాయికి మంచి మొగుడు దొరికాడు.






చిక్కుడాకుమీద చిలుకవాలింది
చిలుకెక్కి ఓరాజు చిక్కివున్నాడు
అరిటాకుమీద హంసవాలింది
హంసెక్కి ఓరాజు అమిరివున్నాడు
కొబ్బరాకుమీద గోరవాలింది
గోరెక్కి ఓరాజు కోరివున్నాడు
మామిడాకుమీద మంచువాలింది
మంచెక్కి ఓరాజు పొంచియున్నాడు
గుమ్మడాకుమీద గువ్వవాలింది
గువ్వెక్కి ఓరాజు గూడొగ్గినాడు
చిక్కుడాకుమీద చిలక అబ్బాయి
చిలకెక్కి అమ్మాయి చిక్కివున్నాది
అరిటాకుమీదనే హంస అబ్బాయి
హంసెక్కి అమ్మాయి అమిరివున్నాది
కొబ్బరాకుమీద గోర అబ్బాయి
గోరెక్కి అమ్మాయి కోరివున్నాది
మామిడాకుమీద మంచు అబ్బాయి
మంచెక్కి అమ్మాయి పొంచివున్నాది
గుమ్మడాకుమీద గువ్వ అబ్బాయి
గువ్వెక్కి అమ్మాయి గూడొగ్గినాది

సంపాదన :— దీవి భానుమతీదేవి



# తండ్రి కొడుకులు



(గతసంచిక తరువాయి)

ఆ రాత్రి సత్యానికి సరిగా నిద్రపట్టలేదు. మామూలుగా తొమ్మిది కొట్టగానే నిద్ర పొయ్యేవాడు ఇవాళ రాత్రల్లా పక్కమీద అటూ యిటూ దొర్లుతూనే ఉన్నాడు. సూరయ్యమటుకు, మనసు ఎంత కలతగా ఉన్నా తొమ్మిది కొట్టగానే పడుకుని, వెంటనే నిద్రపోయినాడు.

సత్యానికి తెల్లవారకముందే మెలకువ వొచ్చింది. పక్కమీదినుంచి లేచి తోచని వాడల్లే ఇల్లంతా తిరిగాడు. గదిలోకి వెళ్లి అద్దంలో తన బట్టతలా మీసాలూ చూసు కున్నాడు. కళ్లజోడు పెట్టుకుంటేగాని అదైనా సరిగా కనిపించలేదు.

సూర్యోదయమై గంట అయినప్పటికీ సూరయ్య లేవలేదు. ఇంతలో బడినుంచి ఒక కుర్రవాడు వచ్చాడు. వాడు సత్యాన్ని ఎరిగినవాడే. అయినా గుర్తించక, 'ఏమండీ, మీ సత్యాన్ని పంతులవారు పిలుచుకు రమ్మన్నారు,'' అని చెప్పాడు.

సూరయ్య లేచాడు. అలవాటుప్రకారం వంటలక్కను కేకపెట్టాడు. కాని వంట లక్క కేకవినికూడా పలకలేదు ఇంతలో తనకొడుకు ఈడు కుర్రవాడు లోపలికి వచ్చి, ''ఒరే, నన్ను మేష్టారు పిలుచుకు రమ్మన్నారు,'' అని చెప్పాడు.

సూరయ్యకు కోపమూ, ఏడుపూకూడా వచ్చాయి.

''ఛీ, ఎవర్రా నువు? పో అవతలికి? నీ పంతుల్నిట్లా రమ్మను,'' అన్నాడు సూరయ్య.

కాని సూరయ్య బడికివెళ్ళక తప్ప లేదు. బడినుంచి వచ్చిన కుర్రవాడు గట్టివాడు. వాడంటే పిల్లలందరికీ హడలే. ఎవరు బడికి రాకపోయినా మేష్టరు వాణ్ణి పంపిస్తాడు. సూరయ్య వాడికి చిక్కి తప్పించుకోలేక పోయినాడు.

సూరయ్యను చూడగానే మేష్టరు పేముబెత్తం తీసుకుని రెండు చేతులమీదా నాలుగేసి దెబ్బలుకొట్టి గోడకుర్చీ వేయించి, ''మీ తండ్రిగారు ఎంత పెద్దమనిషి! ఆయ నకు నీవంటి దౌర్భాగ్యుడు పుట్టటం చాలా ఆశ్చర్యంగా ఉంది. నీ ఆటలు రోజూ మితిమీరి పోతున్నాయి. ఇక నిన్నుచూస్తూ ఊరుకునేదిలేదు. బండకొయ్య తగిలి స్తాను. ఏమనుకున్నావో,'' అని మందలించాడు.



సూరయ్యకు కళ్ళనీళ్ళు బొట బొటా కారాయి. ఇంత అవమానం పొందటం కన్న చచ్చిపోవటం మేలనిపించింది. ఆ పంతుల్ని, ఆయన చదువుచెప్పే పద్ధతినీ, అక్కడి పిల్లల్నిచూస్తే సూరయ్యకు ఆశ్చర్యమూ కోపమూ కూడా వచ్చింది. ఇదేం పంతులు? ఇదేం చదువు? పాపం, సత్యం యిటువంటి అర్థంలేని చదువు చదువుతున్నాడా? అనుకున్నాడు.

కాస్సేపు పిల్లలంతా ఎక్కాలు వల్లె వేశారు. ఆ తరవాత నెలలపేర్లూ, తిథుల పేర్లూ వల్లెవేశారు. అంతాకలిసి అరుస్తుంటే కాకిగోల. ఆ తరవాత పిల్లల్ని అల్లరి చెయ్యవద్దని చెప్పి పంతులు గోడకి చేరగిలబడి నోట్లోకి ఈగవెళ్లిందికూడా తెలియకుండాగురకపెట్టి నిద్రపోయినాడు. పిల్లలు అల్లరి ప్రారంభించారు.

పిల్లలంతా సూరయ్యచుట్టూ మూగారు. అందరూ తనని "సత్యం" అని పిలిచేవాళ్ళే కాని ఒక్కరిపేరూ తనకు తెలిదు. ఒక్కరి మొహమూ తను ఎరగడు. ఆసంగతి పిల్లలకేం తెలుస్తుంది? సత్యం పొగరుపట్టి తమతో మాట్లాడటంలేదనుకున్నారు. సూరయ్యను ఏడిపించటం మొదలు పెట్టారు. ఒకడు చెవిగిల్లాడు మరొకడు తొడపాశంపెట్టాడు. ఈ కుద్ర వెధవలు తనను యింత చులకన చేస్తున్నారనే రోషమూ, యేమీచెయ్యటానికి లేకపోవటంవల్ల దుఃఖమూ సూరయ్యను బాధించాయి. ఆఖరుకు భరించలేక ఒక్క పొలికేక



పెట్టాడు సూరయ్య అతను అంతపని చేస్తాడని పిల్లవాళ్లెవరూ అనుకోలేదు. పంతులు లేస్తాడని వాళ్ళకు తెలుసు. అందుచేత చప్పున ఎవరిదారిన వాళ్లు యేమీ ఎరగనట్టుగా కూచున్నారు.

పంతులు లేవనే లేచాడు. లేస్తూనే బెత్తంతీసుకుని సూరయ్యను బాదసాగాడు. సూరయ్యకు మతిపోయినట్టయింది.

"నీతాడుతెగ? నీ చదువు చట్టుబండలు గానూ! ఇందుకేనా నేనింత డబ్బిచ్చింది? ఉండు నిన్నేంచేస్తానో! మాటి మాటికీ బెత్తంతీసుకుని పిల్లల్ని చావగొడతావుట్రా? నీ చేతులు పడిపోనూ!" అని సూరయ్య పంతుల్ని తిట్టసాగాడు.

మిగిలిన పిల్లలంతా గట్టిగా నవ్వసాగారు. పంతులు ఒక్క క్షణంపాటు నిర్ఘాంతపోయినాడు. యేమనుకున్నాడో యేమిటో సూరయ్యను వెళ్లి గోడకుర్చీ వెయ్యమన్నాడు. సూరయ్యకి క్షణ క్షణానికీ పరాభవం జాస్తి అవుతున్నది కాని తగ్గటంలేదు.

పంతులు సూరయ్యని పరీక్ష ప్రారంభించాడు. పంతులు వేసిన ప్రశ్నలు కొన్ని సూరయ్య సులభంగానే చెప్పాడు. కాని మరికొన్నిటికి చెప్పలేక పోయినాడు. పుస్తకం చదివితేగాని తెలియని విషయాలకు సూరయ్య ఎట్లా సమాధానం చెబుతాడూ?

గోడకుర్చీ వెయ్యటం సూరయ్యకు దుర్భరమయింది. పిల్లలందరూ వేళాకోళం ప్రారంభించారు. గోడకుర్చీ వేసి సూరయ్య అలసిపోయినాడు. పంతులు వాళ్ళనేమీ అనలేదు.

పంతులు లెక్కలిచ్చాడు. పంతులు లెక్క చెప్పటం ఇంకా పూర్తికాకముందే సూరయ్య సమాధానాలు చెప్పసాగాడు. పంతులుకు ఆశ్చర్యంవేసింది. సత్యం లెక్కల్లో మొద్దు అటువంటివాడు తడువుకోకుండా నోటి సమాధానాలు చెప్పటం పంతులుకు ఆశ్చర్యంగా ఉండదూ?

"దొంగవెధవా, ఇంతకాలమూ నీకు లెక్కలు బాగా వచ్చిఉండికూడా నాదగ్గిర మొండితనంచేసి రానట్టు నటిస్తున్నావా?" అని పంతులు సూరయ్యని రెండువేశాడు.

ఎప్పుడు మధ్యాన్నమవుతుందా, ఎప్పుడు పంతులు బడి విడిచిపెట్టి ఇంటికి పోతాడా అని సూరయ్య ఎదురుచూడసాగాడు. ఎట్లాగైతేనేం పంతులుగారు బడి చాలించాడు. మామూలు పిల్లవాడైతే బడివదిలిన మరుక్షణం తిన్న దెబ్బలూ చివాట్లూ మరిచిపోతాడు. కాని సూరయ్య, యిన్నేళ్లు వచ్చినాక జరిగిన ఈ పరాభవం ఎట్లా మరుస్తాడు? అందరు పిల్లలూ ఇళ్లకు బయలుదేరారు. కొందరు పరిగెత్తారు, కొందరు ఒయ్యారపునడకలు నడుచు



ఉంటూ చీకూ చింతా లేకుండా బయల్దేరారు. సూరయ్యతప్ప అందరూ ఉత్సాహంగానే ఉన్నారు.

అందులో కొందరు సూరయ్య చుట్టూ చేరి, "ఏంరా, సత్యం? ఏం జరిగిందో చెప్పవూ? నువ్వు బొత్తిగా కొత్తమనిషల్లే ఉంటున్నావే!" అని గుచ్చి గుచ్చి అడిగారు. సూరయ్య విసుక్కుని, "నేను కొత్తమనిషినే. అసలు నాపేరు సత్యం కాదు. నన్ను పలకరించకండి," అన్నాడు.

ఇంటికిపోయి ఏం చెయ్యాలి? ఇంటో సత్యం ఏంచేస్తున్నాడో? వాడి రహస్యం ఈపాటికి అందరూ కనుక్కుని ఉంటారనుకున్నాడు సూరయ్య ఈ ఆలోచనతో జారిపోయిన ఆశ మళ్ళీ తిరిగి రాసాగింది. తను సూర్యయ్యంటే నమ్మరు నిజమే. కాని సత్యాన్నిచూసి తనే అనిమటుకు ఎవరు నమ్ముతారూ? తన స్నేహితులెందరో వస్తారు. వ్యవహారాలు మాట్లాడతారు. అవన్నీ సత్యానికేం తెలుసూ? అందువేత సత్యం గుట్టు ఈపాటికి బయటపడి ఉంటుంది. సత్యం గుట్టు బయటపడితే తనవిషయం సులభంగా రుజువు అవుతుంది.

ఈ ఆశతో సూరయ్య ఇంటికి బయల్దేరాడు. కడుపులోకూడా మాడిపోతున్నది. ఆయనకోసం వంటలక్కకూడా కనిపెట్టుకుని ఉంది.




"రా, నాయనా! ఎప్పుడో పొద్దునతిన్న అన్నం!" అంటూ వంటలక్క సూరయ్యను కూచోబెట్టి బాగా మేపింది. అయన అన్నం తింటుండగా, "పంతులు బాగా కొట్టాడా?" అని అడిగింది. సూరయ్య మొహం ఎర్రబడింది సిగ్గుతో.

"నాకోసం ఎవరైనా వచ్చారా?" అన్నాడు సూరయ్య మాట మార్చటానికి.

"నీకోసం ఎవరువస్తారు, నాయనా?" అన్నది వంటలక్క.

సత్యం విషయం వంటలక్క నడగాలనుకున్నాడు గాని ఎట్లా అడగాలో తెలియలేదు. అదృష్టవశాత్తూ వంటలక్కే చెప్పింది.

"మీ నాన్నగారికోసం చాలా మంది వచ్చారు. కాని ఆయనకు ఒంటో బాగున్నట్టులేదు. ఒకరిద్దర్ని చూసి మరెవర్నీ చూడనని పోయి గదిలో ముసుగుతన్ని పడుకున్నారు," అని చెప్పింది వంటలక్క.

"ఎవరెవరు వచ్చారు?" అని అడిగాడు సూరయ్యా.

వంటలక్క ఇద్దరు ముగ్గురి పేర్లు చెప్పింది. సూరయ్యా అదుర్దా జాస్తి అయింది. గబగబా తిండి పూర్తిచేసి తన గదికివెళ్లి తలుపు తట్టాడు. ఎన్నిసార్లు తలుపుతట్టినా జవాబులేదు.

"సత్యం, సత్యం," అని పిలిచాడు.

"నువా?" అన్నాడు సత్యం.

"తలుపుతియ్యి. మాట్లాడాలి," అన్నాడు సూరయ్యా.

"నే నిప్పుడు నిద్రపోతున్నాను. రాత్రికి మాట్లాడవాం," అన్నాడు సత్యం.

సూరయ్యా పెద్దగా తలుపు తియ్యమని అరిచాడు. కాని నౌకరువచ్చి సూరయ్యాను రెక్కపట్టుకుని కిందికి లాక్కొచ్చాడు.

"నీసంగతేమీ బాగాలేదు. అల్లరిచేస్తే మీ నాన్నగారు మక్కెలు విరగ్గొడతారు," అని హెచ్చరించి నౌకరు వెళ్లిపోయాడు.

సూరయ్యాకు ఇంకో ఉపాయం తట్టింది తనకు వ్యవహారాలున్న వాళ్లందరికీ ఉత్తరాలు రాద్దామనుకున్నాడు. కాని తన దస్తూరిచూస్తే ఎరిగినవాళ్ళు గుర్తించేటట్టుగాలేదు. సూరయ్యా దీర్ఘమైన ఆలోచనలో పడ్డాడు. ఎటుచూసినా తప్పించుకునేమార్గం లేదు మళ్లీ కాస్సేపటికి బడికిపోవాలి. సూరయ్యా తన సొంతవిషయమే ఆలోచిస్తాడా? ఇంటి వ్యవహారాలే ఆలోచిస్తాడా?

సత్యం రహస్యం బయటపడేవరకూ తనసంగతి ఎవరూ పట్టించుకోరు. అంతదాకా తను ఎక్కడికైనా పారిపోతే చాలా చిక్కులు వదిలిపోతా యనిపించింది. ఈసంగతి సత్యానికి తెలిస్తే పోనివ్వడు. డబ్బు దొరికే ఉపాయంలేదు. డబ్బు లేకుండానే పారిపోదామనుకున్నాడు సూరయ్య. వంటలక్కగాని, ఇంకో నౌకర్లుగాని చూడకుండా ఇంటోనుంచి బయటపడి స్టేషనుకేసి నడిచాడు సూరయ్య. మధ్యాన్నం రెండున్నరకొకబండీ ఉంది. అది ఎక్కిపోవచ్చు. ఎక్కడికిపోవాలి, ఏంచెయ్యాలనేది సూరయ్యా ఆలోచించలేదు.

(ఇంకావుంది)






ఇక్కడ A,B,C,D,E అని పేర్లుగల ఐదుస్టీమర్లు వున్నై. ఆ అయిదు స్టీమర్లూ అదే పేరుగల రేవు పట్టణాలకి చేరాలి. అలా చేరేటప్పుడు ఒక స్టీమరు వెళ్లినదారీ మరో స్టీమరు వెళ్లినదారీ కలవకూడదు. ఏస్టీమరు దారి ఆ స్టీమరుకే వుండాలి. మీరు ఒకొక్క స్టీమరునీ దాని రేవుపట్టణానికి పెనిసిలుతో కలపండి చూద్దాం.

మీకు తెలియకపోతే జవాబుకు 134 వ పేజీ చూడండి.



రాముడు ఒక కుక్కపిల్లని పెంచుతున్నాడుట. అది ఒకరోజున తప్పించుకొని ఒక అడవికి పారిపోయింది. అడవిలో అనేక దారులున్నై. ఏదారిన వెళ్లాలో రాముడికి తెలియలేదు. మీకు తెలిస్తే, అదారి రాముడికి చూపించండి.



ఈ చదరం నాలుగుమూలలా నాలుగు పిల్లులు వున్నై. ఆ నాలిగింటిలో ఏదో ఒక పిల్లిమాత్రమే ఎలుకను పట్టుకోగలదు. ఆ పిల్లి ఏదో మీరు కనుక్కోండి.







"నాన్నా! ఈ లెఖ్ఖ రైటేమో చూడు!"




"ఒరే, రామూ! నువ్వు బయటికి ఎప్పుడు వెళ్ళావురా?"

"కళ్లికోట యుద్ధం జరుగుతుంటగా నండీ సార్!"



"నేను సాయంత్రం పాటకచ్చేరికి పోవాలి. చాకలింటికి పోయి బట్టలుతీసుకురమ్మని చెప్పు."

"ఎందుకు నాన్నారూ? మీరు పాడటం మొదలెడితే, వాడే పరిగెత్తుకుంటూ వస్తాడు!"



"నీకంటే నేను అయిదురెట్లు పెద్ద."
"అట్లాగయితే నాకు ఏడాదప్పుడు మీకు ఐదేళ్లేనా, నాన్నా ?"



"ఒకసేప్, "చిట్టీ! నా షేవింగ్ బ్రష్ చూశావా?"
"నీ బ్రష్ సంగతి నాకు తెలీదుగాని తమ్ముడి గుర్రానికి తోకవచ్చింది నాన్నా!"



"అబ్బాయి, ఎదో ఉత్తరం పడిపోయింది, చూసుకో!"



"థాంక్స్, అది నా మనమడు రాసిన ఉత్తరం లెండి!"



# సరస్వతి

●

ప్రొద్దున్నే లేచి తమ్ముడికి
నీళ్లుబోసి చొక్కా తొడిగింది

●

ఫొటోలు తీసినవారు:

●

శుభ్రంగా తలదువ్వి
బొట్టు పెట్టింది

●



# మంచిపిల్ల



పలకా పుస్తకాలు చేతికిచ్చి

బి. రంగనాథం, మద్రాసు



పాఠం నేర్పింది
సరస్వతి మంచిపిల్లకాదా?

# చిక్కు బొమ్మలు

స్టీమరుల బొమ్మకు జవాబు






ఈ బొమ్మ చూశారా? ఇది ఏమిటో తెలుసా? కుందేలు. దాన్నికోసి నాలుగు భాగాలుగాచేశారు. బొమ్మలోని ఈ నాలుగు భాగాలనీ తిరిగి జాగ్రత్తగా అతికిచూడండి.

పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 చై | నా | | 2 త | | 3 ఈ | 4 వి |
| త్ర | | కీ | ర | ము | | జ |
| వై | రి | | 8 గ | చ్ఛ | కా | య |
| శా | | 9 రూ | | ట | | న |
| 10 ఖ | గ | ప | 11 తి | | 12 పా | గ |
| ము | | 13 ము | వ్వ | న్నె | | ర |
| లు | తే | | లు | | 14 నో | ము |



అబ్బాయిలూ, అమ్మాయిలూ!

ఈ బొమ్మచూశారా? తల్లికోతీ పిల్లకోతీ చేరి ఒక చెట్టుమీద ఎగురుతూ గంతులేస్తూ ఆడుకుంటున్నైట. ఆడుకుంటుండగా పిల్లకోతి ఎక్కడో దాక్కుందిట. తల్లి కోతి దానికోసం వెతికితే ఎక్కడా కనిపించలేదట. మీకు కనిపిస్తే ఆ పిల్లకోతినితల్లికోతికి చెప్పచెప్పండి.



ఈబొమ్మలో రథచక్రమూ వుంది, సూర్యుడూ వున్నాడు. ఈ రెంటిలో ఏది పెద్దదో కనుక్కోండి చూదాం? కొలిచి చూడగూడదు.

మీరు కనుక్కోలేకపోతే జవాబులు 136 పేజీలో చూడండి

# నేటి పాపలు రేపటి పౌరులు





"విచారం"
చి॥ రమాలీల, బెజవాడ.



"అనుమానం"
చి॥ శారద, మద్రాసు.



"తృప్తి"
చి॥ సుబ్రహ్మణ్యశాస్త్రి, బెజవాడ.



"సంతోషం"
చి॥ శాంతసుందరి, మద్రాసు.






## ఆధారములు

**అడ్డము :**

1. ఒక దేశము.
3. దాతృత్వము.
5. చిలుక.
7. శత్రువు.
8. ఒక కాయ.
10. గరుత్మంతుడు.
12. ధూమము.
13. త్రివర్ణము.
14. వృశ్చికము (తలక్రిందులు)
15. వ్రతము.

★

**నిలువు :**

1. వసంతఋతువు.
2. కెరటము.
4. ఆంధ్రదేశములో ఒక పట్టణము.
6. మురిపెము.
9. ఆకారము.
11. తీగలు.

134 పేజీలోని చిక్కుబొమ్మలకి

జవాబులు :



1. పిల్లకోతి తల్లికోతి తలలోనే దాక్కుంది.
2. రథ చక్రమూ సూర్యుడూ రెండూ సమానమే.

ఈ బొమ్మకు రంగువేసి మీవద్ద నుంచుకొనుడు!




# CALENDAR

| 1947 | SEPT. | | | | | | OCT. | | | | | | | NOV. | | | | | | 1947 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| S | M | T | W | T | F | S | S | M | T | W | T | F | S | S | M | T | W | T | F | S |
| * | 1 | 2 | 3 | 4 | 5 | 6 | * | * | * | 1 | 2 | 3 | 4 | 30 | * | * | * | * | * | 1 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 28 | 29 | 30 | * | * | * | * | 26 | 27 | 28 | 29 | 30 | 31 | * | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 |

ఈ బొమ్మను అందముగా అగుపడునట్లు చేయుడు.
ఒక అట్టమీద అతికించి క్యాలెండరుగా ఉపయోగించుడు.

---

ది తాతా ఆయిల్ మిల్స్ కంపెని లిమిటెడ్.,
బాంబే హౌస్: బొంబాయి.

జనవరి 14 సంక్రాంతినాడు అన్ని ముఖ్యకేంద్రాలలోను విడుదల






పోటిలేని మేటినాటకమని కొనియాడబడ్డిన

# వింధ్యరాణి

నిర్మాతలు.. వైజయంతి ఫిలిమ్స్ లిమిటెడ్

డైరెక్షన్.. సి. పుల్లయ్య.......స్టూడియో...జెమిని..

జెమినీ రిలీజు

ఆంధ్ర, రాయలసీమ, హైద్రాబాదులకు సబ్ డిస్ట్రిబ్యూటర్లు:

చప్రియాటాకీ డిస్ట్రిబ్యూటర్సు - బెజవాడ.

# 1948 జనవరి 2-వ తేది ఆంధ్రదేశమంతటా విడుదల

ఆడజన్మకు ఆదర్శం ఏమిటి? ఆశామోహాలతో అల్లిబిల్లిగొన్న ఆలి తనమేనా?

కాదు { మహనీ యదయా మహితమూ సేవాశీలమైన మాతృత్వమే
అని పార్వతీపరమేశ్వరుల ఆదేశం. ఆ విధానానికి చూడండి!




దర్శకుడు: రామకృష్ణ

★

భరణీ వారి

# రత్నమాల

తారాగణం:
భానుమతి డా॥ సుబ్బారావు, సి. యస్. ఆర్.
నాగేశ్వరరావు, హేమలత, ఆరణి మొదలగువారు.

రచన: సముద్రాల ★ సంగీతం: సుబ్బరామన్ ★ స్టూడియో: న్యూటోన్

బెజవాడ, రాజమండ్రి, కాకినాడ, విజయనగరం, విశాఖపట్నం, మచిలీపట్నం,
తెనాలి, ఏలూరు, గుంటూరు, కర్నూలులో ఒకేసారి విడుదల.

**BHARANI PICTURES : T'NAGAR, MADRAS.**

Printed and Published by B. N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras 1
Editors CHAKRAPANI and K. RAJA RAO.



*Chandamama Sankranti Number* *Photo by— R. Krishnan*

గొల్లభామ !

